*Issued on 18-10-1957*




VOL. V
No. 8

*26th July, 1957*
*(Friday)*

# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES
# OFFICIAL REPORT

## Part II—PROCEEDINGS OTHER THAN QUESTIONS AND ANSWERS

---

CONTENTS



---

NOTE: *At the commencement of the speech denotes confirmation from the Member not received in time.

PRINTED BY AJANTA PRINTERS, SECUNDERABAD
FOR THE DIRECTOR, GOVERNMENT PRINTING PRESS
ANDHRA PRADESH, HYDERABAD.

1957

# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

OFFICIAL REPORT

---

*Fortieth Day of the Fifth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Friday, the 26th July,* 1957

The House met at Half Past Eight of the Clock

[MR. SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## ADJOURNMENT MOTION RE: PRESENCE OF WILD ANIMALS IN YELLENDU TALUK

మిస్టర్ స్పీకర్: ఇప్పుడు ఒక వాయిదా తీర్మానాన్ని శ్రీ కె. యల్. నరసింహారావుగారు యిచ్చారు.

"ఈ సంవత్సరం అన్ని ప్రాంతాలలోనూ అప్పుడే క్రూరమృగముల దాడి ప్రారంభమైనది. ఇల్లెందు తాలూకా, చీమలపాడు అనే గ్రామంలో బంభాడి రాములు అనేవానిని పెద్దపులి చంపివేసినది. అడవిప్రాంతంలోనివారు ఆత్మ రక్షణకుగాను ఆయుధాల నుంచుకొనుటకు ప్రభుత్వంవారు licence లు ఇవ్వ నిరాకరించడం సర్వసామాన్యమైనది. ఇది ప్రజలలో తీవ్రఅలజడికి, ఆందోళనకూ కారణభూతమైనది. ఇది చాలా ముఖ్యం, అత్యావసరమైన విషయం, కావున సభాసమావేశమును వాయిదావేసి ఈ విషయమై చర్చించుటకు అవకాశ మీయవలెను."

**It is not a matter of urgent public importance.** ఇది మామూలు ప్రశ్నే. పెద్దపులులు ప్రతి ఏటా వస్తున్నాయి, మనుష్యులు ప్రతి ఏటా చస్తున్నారు.

ఆయుధాల ప్రశ్న ఎప్పుడూ వుండనేవున్నది. ఈ విషయంలో ప్రభుత్వంవారు ఆలోచిస్తారు. అయినా పోలీసు డిమాండు వచ్చినప్పుడు general గా సభ్యులు ప్రశ్నలు వేస్తే, హోంశాఖా మంత్రిగారు ఆయుధాలను ఎవరికిస్తారో, ఎవరికి ఇవ్వరో ప్రభుత్వ పాలసీ ఏమిటో— అన్నీ చెబుతారని తలుస్తాను. అందువల్ల ఇది యిప్పుడు కొట్టివేయడమైనది.

శ్రీ కె. యల్. నరసింహారావు (ఇల్లందు-జనరల్): ఈ విషయంలో మంత్రిగారు ఏమి చెబుతారో......

మిస్టర్ స్పీకర్: మంత్రిగారు ఏమి చెబుతారో ఇప్పుడు అడగవలసిన పనిలేదు. పోలీసు డిమాండు వచ్చినప్పుడు general గా అడగండి, మంత్రిగారు general గా సమాధానం చెబుతారు. కాబట్టి యిది వాయిదా తీర్మానం కాదని నేను declare చేశాను. అందువల్ల మంత్రిగారిని ఇప్పుడు పిలవవలసిన అవసరంలేదు.

## BUDGET — DEMANDS FOR GRANTS

*Mr. Speaker:* The hon. Chief Minister will now move his Demands,

*The Chief Minister (Sri N. Sanjeeva Reddi):* Mr. Speaker, Sir, on the recommendation of the Governor, I beg to move:

"That a sum not exceeding Rs. 1,63,49,200 be granted to the Government under Demand No. XXIII—Industries."

"That a sum not exceeding Rs. 1,85,37,500 be granted to the Government under Demand No. XXXIV — Road Transport Department."

"That a sum not exceeding Rs. 2,09,08,800 be granted to the Government under Demand No. XL—Capital Outlay on Industrial Development."

"That a sum not exceeding Rs. 69,08,000 be granted to the Government under Demand No. XLIV—Other State Workers."

"That a sum not exceeding Rs. 40,60,500 be granted to the Government under Demand No. XLV–Road Transport Department."

*Mr. Speaker*: Motions moved.

*శ్రీ ఎన్. సంజీవరెడ్డి: అధ్యక్షా, ఈ డిమాండులోని ముఖ్యమైన విషయాలు సభ్యులందరికీ ముందుగానే తెలియాలనే ఉద్దేశంతో detailed information అంతా నిన్ననే సభ్యులకు అందజేశాను. ముఖ్యంగా, పెద్దపెద్ద పరిశ్రమలు ఎట్లా ఉన్నాయి; ఏయే పరిశ్రమలలో ప్రభుత్వదబ్బు ఎంతఉన్నది; అవి ఎట్లా పనిచేస్తున్నవి, ఏమైనా ఆదాయం వస్తున్నదా, అనే విషయాలన్నీ

చిన్న పరిశ్రమలను గురించీ పెద్దపరిశ్రమలను గురించీ ఏమీ దాపరికం లేకుండా detailed గా సభ్యులకు అందజేశాను. మిత్రులు చదివేవుంటారనుకొంటాను. ఇందులో కొన్నిపరిశ్రమలు బాగానే పనిచేస్తున్నాయి. సింగరేణి, బోధన్ లాంటివి కొద్దిగా పనిచేస్తున్నాయి. ప్రాగాటూల్సు బాగా పనిచేస్తున్నదని చెప్పడానికి వీలులేదు కాని సరైనదారిలో పడే పరిస్థితులున్నాయి. Sir Silk, సిరిపూర్ పేపర్ మిల్స్ మొదలైనవాటిలో ఇప్పుడిప్పుడే బాగా జరపడానికి ప్రయత్నం చేస్తున్నారు. కొన్ని పరిశ్రమలు చాలా అధ్వాన్నస్థితిలో ఉన్నాయి, యాజ్ బెస్టాస్, ఆల్విన్ మెటల్ వర్క్సు, గ్లాస్ ఫ్యాక్టరీస్ వీటికి మూలధనాన్ని కూడా రద్దుచేసికొనే పరిస్థితి ఏర్పడినట్లు కనబడుతున్నది. మూలధనాన్ని రద్దు చేయకపోయినా, కనీసం వాటికివున్న వెలలు పూర్తిగా తగ్గించి కొత్తగా మూలధనం ఏర్పాటు చేస్తేతప్ప ఆ పరిశ్రమలు నడిచేటట్లు లేవు. అభివృద్ధి అంతకంటేకావు. ఈ విషయాలన్నీ సభ్యులకు ముందుగానే తెలియచేశాను.

ఇక నేను చిన్నపరిశ్రమల గురించి చెబుతాను. గృహ పరిశ్రమలు, Small Scale Industries గురించి ప్రశ్నలరూపకంగా అడిగినప్పుడు నేను సమాధానాలు చెప్పాను. అఖిలభారత ప్రభుత్వం వీటికి కొద్దిగా సహాయం చేస్తోంది, ఈ పరిశ్రమలకు వచ్చే సహాయం చాలా తక్కువ. సంవత్సరానికి దాదాపు 4 లక్షలు మాత్రమే మనకు ఈ పరిశ్రమలకుగాను కేటాయించడం జరుగుతున్నది. అందులో 6 లక్షలు grant క్రింద, మిగిలిన 18 లక్షలు అప్పుగానూ మంజూరు చేయడమైనది. ఇది చాలా చిన్నమొత్తం. అప్పు, గ్రాంటు రెండూకలిపి దాదాపు 24 లక్షల రూపాయలు మాత్రమే యిస్తే, పరిశ్రమలు నడవడం కష్టమౌతున్నదీ. మొన్న ప్రశ్నలరూపంగా వచ్చినప్పుడు జవాబు చెబుతూ, వీటికి, మరికొన్ని small scale industries కూ ఇంకా హెచ్చుసహాయం కావాలని చెప్పాను. Radio spare parts, cycle spare parts విషయమై వాటిని తయారుచేసుకోడానికి ఫ్యాక్టరీ పెట్టించాలనీ, fractional horse power engines కూడా తయారు చేయించేందుకు చిన్న చిన్న పరిశ్రమలు నెలకొల్పాలనీ, నెల్లూరులోనో, విజయవాడలోనూ, హైదరాబాదులోనూ పెట్టవచ్చునని చెప్పాను. ఇవన్నీ మేము recommend చేసి పంపినాము. ఇప్పుడు ఢిల్లీ ప్రభుత్వం దగ్గర ఉన్నాయి. వారు అప్పుగానో, గ్రాంటుగానో మనకు యిచ్చే విషయమై త్వరగా ఉత్తరువులు వస్తే యిప్పుడు మనం అనుకున్న పరిశ్రమల కంటె హెచ్చుగా ప్రారంభించడానికి వీలవుతుంది. Cottage Industries విషయమై కూడా schemes పంపినాము. కాని అందులోని కొన్ని schemes మాత్రమే sanction చేయబడినాయి. ఎక్కువ డబ్బు లేనందువల్ల హెచ్చు స్కీములు sanction చేయడం జరగలేదు. ఇది తెలంగాణా పరిస్థితి. మేజర్ ఇండస్ట్రీస్ గురించిన విషయాలన్నీ నిన్న circulate చేశాను కనుక వాటి విషయమై ఇప్పుడు నే నేమీ చెప్పుటలేదు.

ఆంధ్ర ప్రాంతంలో చక్కెర, సిమెంటు ఫ్యాక్టరీలు ముఖ్యమైన పరిశ్రమలు. ఇంకా ఆంధ్ర పేపర్ మిల్లు, సిరమిక్ ఫ్యాక్టరీలు ఉన్నాయి. అక్కడ చెప్పకోదగ్గ పరిశ్రమలు ఆ రెండే. మిగిలినవన్నీ public sector లో గాని, private sector లో గాని co-operative basis మీదగాని నడుస్తున్నాయి. ఇప్పటి కప్పుడే production లో వున్న Cement Factories రెండు. అవి మంగళగిరి దగ్గర ఒకటి, విజయవాడ దగ్గర మరొకటి ఉన్నాయి. ఇవిగాక, అయిదారు సిమెంటు కంపెనీలు licences సంపాదించు కొన్నాయి. కాని ఇంకా production ప్రారంభించలేదు. అవి ఎక్కడెక్కడ పెట్టినది, ఎవరెవరికి licences యిచ్చినదీ నేను నిన్న circulate చేసిన statement లో లేవు కాబట్టి వాటి విషయం చెబుతాను. రామకృష్ణ సిమెంట్ లిమిటెడ్, మాచర్ల- లక్ష టన్నులు; ఆంధ్ర సిమెంట్స్, నడికూడి- 1,95,000 టన్నులు. మెసర్స్. పి. యస్. నారాయణ, ఇండియా సిమెంట్స్ లిమిటెడ్, విజయనగరం- లక్ష టన్నులు. రాయలసీమ డెవలప్‌మెంట్ కార్పొరేషన్, కమలాపురం, కడప జిల్లా- 1,26,000 టన్నులు. పాండ్యం సిమెంట్స్ లిమిటెడ్- 62,740 టన్నులు. Associated Cements Limited, యర్రగుంట్ల-6,700 టన్నులు, Associated Cement Company Limited, అదిలాబాదు జిల్లా- 1,80,000 టన్నులు. ఈ కంపెనీలు ఆయాస్థలాలలో ఏర్పాటు చేయడానికి licences యివ్వబడినాయి. అవి ఏర్పడి, త్వరలోనే పని ప్రారంభిస్తాయని ఆశిస్తున్నాను. కొన్ని కంపెనీలకు మొత్తాలు రావడం, వాటికి కావలసిన బిల్డింగ్స్ కట్టుకోవడం జరుగుతున్నది. మన రాష్ట్రంలో ఇన్ని సిమెంటు కంపెనీలను, స్థాపించుకున్నా సిమెంటు ధర పెరిగిపోతుందే? అన్న ప్రశ్న వస్తుంది. Black market లో హెచ్చు ధరలకు అమ్ముతున్నారనే ప్రశ్న కూడా వస్తుంది. ఇది మన ఒక్క రాష్ట్రానికే సంబంధించినదికాదు. All India Pool లో మనకు వచ్చిన allotment ను బట్టి తీసుకోవాలి గాని మనరాష్ట్రంలో హెచ్చుగా ఉత్పత్తిచేస్తున్నాము, కాబట్టి సిమెంటు అంతా మనమే వాడుకోవచ్చు అనే పద్ధతి నమసరించడానికి వీలులేదు. అయినా మన రాష్ట్రంలో ఈ సిమెంటు కంపెనీలన్నీ త్వరలోనే ఏర్పడి ఉత్పత్తి ప్రారంభిస్తున్నందుకు మనం సంతోషపడాలి. పంచదార మిల్లుల విషయం అందరకూ తెలిసినదే. ఇప్పుడున్న మిల్లులు చాలా బాగాపనిచేస్తున్నాయి. మంచి లాభాలు సంపాదిస్తున్నాయంటున్నారు. బోధన్ చక్కెరమిల్లుకు కూడా హెచ్చులాభాలు వస్తున్నట్లు నిన్న నేను circulate చేసినదాంట్లో తెలియజేశాను. సంవత్సరానికి దాదాపు 40 లేక 50 మిలియనులు లాభంవస్తున్నది. డివిడెండ్సు కూడా హెచ్చుగానే పంచబడుతున్న విషయం మీకందరికి తెలుసును. "వచ్చేలాభం అంతేనా? దానికి రెండు రెట్లు రావచ్చునే" అని చెప్పవచ్చు. కాని అది వేరు విషయం. బోధన్ ఫ్యాక్టరీనిగురించి ఎంతో కాలంగా పరిశీలనచేసి, అది చక్కగానే నడుస్తున్నప్పటికిన్నీ చాలా complaints వస్తున్నందు

వల్ల దానిలోని సత్యాసత్యాలను తెల్సుకొనడం కష్టమై, అందులో ప్రభుత్వం shares హెచ్చుగా ఉన్నందువల్ల ప్రభుత్వం స్వాధీనములోనే ఎందుకు వుంచుకోకూడదు అనే ఉద్దేశంతో ప్రభుత్వం పరిశీలిస్తోంది. దానిని Hyderabad Construction Company కివ్వటం ఏమిటి, వారు మళ్ళా ఇంకెవరికో ఇవ్వడం ఏమిటి! ఈ రకంగా మారుతూంటే ఏ వ్యక్తో దానికి సర్వాధికారిగా ఉండడం మంచిది కాదేమోనని, ప్రభుత్వధనం అధికంగానున్నది కాబట్టి ప్రభుత్వమే స్వాధీనంచేసుకోడం బాగుంటుందని మంత్రులందరమూ కలిసి ఆలోచించాము. Managing Agencies ను 2, 3 ఏండ్లముందుగానే తొలగించి అనవసరంగా తొందరపడి తీసుకోవడంకంటే, ఇప్పుడు మన ఉద్యోగస్థుని ఒకనిని ఆ factory ని manage చేయుటకు అక్కడ నియమించి, managing agents కు 1 సంవత్సరం నోటీసు యిచ్చి terminate చేస్తే, తరువాత రెండు ఏండ్లు మాత్రమే ఉంటుంది కాబట్టి మనం నియమించిన ప్రభుత్వోద్యోగి ద్వారానే కార్యక్రమాన్ని నడిపించుతూ, వారి దగ్గరనే ఆ మిల్లుపై సర్వాధికారాలు కలిగిఉండేటట్లు చేస్తే మనం అనుకున్నపని బాగా నడవవచ్చు. హెచ్చుఆదాయం రావచ్చు. కాబట్టి మేనేజింగ్ ఏజంట్లను ఒక ప్రభుత్వోద్యోగిని ఆ కార్యకలాపాలు నడిపించేందుకు అక్కడ నియమించడం మంచిదనే నిర్ణయానికి ప్రభుత్వం వచ్చింది.

ఇక Bodhan Sugar factory కి సంబంధించిన 15, 16 వేల ఎకరాలలో, అక్కడ sugar cane ఉత్పత్తి అవుతున్నది. దానికిగాను managing agents అందరు ఏర్పాటుచేసుకున్న అధికార్లు ఎంతోమంది ఉన్నారు. అక్కడ ఉత్పత్తి చేస్తున్న చెరకుయొక్కధర చుట్టుప్రక్కలరైతులు తెస్తున్నధరలతో పోల్చిచూస్తే factory వారు ఉత్పత్తిచేస్తున్న చెరకుయొక్కధర హెచ్చుగాఉంది. Cost of production విపరీతంగావుంది. వేలకువేలు ఎకరాలు సాగుచేస్తున్నప్పుడు cost of production న్యాయంగా తగ్గాలి. కాని తగ్గకుండా రైతుచేసుకునే దానికంటే హెచ్చుగాఉన్నది. దానికికారణమేమో విచారిస్తే, top heavy administration అని జీతభత్యాలు ఎక్కువగా ఉన్నవని తెలిసింది. అక్కడ సంపూర్ణంగా పరిశీలనచేశామని చెప్పకపోయినా, మొత్తానికి అలాంటిలోపాలు కొన్ని ఉన్నవని తెలియవచ్చింది. దాన్ని manage చేయడానికి, ఈ factory కి వుండే 15 వేలఎకరాలు వేరుచేసి, అంటే factory కి ఎలైడ్ (allied) పెట్టకుండా దాని administration కి పూర్తిగా వేరుచేసి, దానిని control చేయడానికి అక్కడ ఒక ప్రభుత్వోద్యోగిని నియమిస్తే బాగుంటుందనే నిశ్చయానికి ప్రభుత్వంవచ్చింది.

ఇక సింగరేణి విషయంలో అక్కడ ఉత్పత్తిబాగానేఉన్నటి, ఆదాయం కూడా బాగానేఉన్నది. దానిని ప్రభుత్వం ఎవరికీ ఒప్పచెప్పలేదు. ఒక ప్రభుత్వోద్యోగిద్వారా ఈపనిఅంతా చూడబడుతోంది. వారు కొన్నిఏళ్ళుగా అక్కడ

ఉన్నారు. Three months notice తో వారి serviceను terminate చేయవచ్చు. Production బాగానేఉందిగాని cost of production విపరీతంగా ఉన్నది. అందువలన బీహార్ నుంచి మంచిబొగ్గు తెచ్చుకొనడం ఎక్కువవలవుతున్నది. ఇక్కడ తయారవుతున్నబొగ్గు అంతమంచిదికాదు అంటున్నారు. కనుక యింకా హెచ్చుగా production increase చేస్తే ఎక్కువ లాభకరంగా ఉంటుంది. అందువలన యిప్పుడు జరుగుతున్నదానికన్నా production ఎక్కువ చేయడానికిగాను అఖిలభారత ప్రభుత్వంవారు దానికి కావలసిన డబ్బుయివ్వ డానికి దాదాపు అంగీకరించారని చెప్పవచ్చు. దాదాపు 6 కోట్ల రూ॥లు అధికంగా మనం invest చేస్తే production పెంచి, హెచ్చులాభంవచ్చేటట్లు చేయవచ్చు. ఈ సం॥రం మెషినరీకి, తదితర ఖర్చులకు 65 లక్షల రూ॥లు కావలసియుంటుంది. ఈ విషయాన్ని వెంటనే ఢిల్లీప్రభుత్వానికి తెలియబరచి నాము. అందుకుకావలసిన పరికరాలకు 10 లక్షల రూ॥లు కావాలని వ్రాస్తే ఆ మొత్తం వెంటనే వచ్చింది. ఆ మొత్తంయివ్వడంవల్ల ఢిల్లీప్రభుత్వం commit అయిందన్నమాట. తాముకూడా ఈ కార్యక్రమంలో పాల్గొని ఉత్పత్తి పెంచ డానికి అంగీకరించారని యిందువలన దృఢంగా చెప్పవచ్చు. నేనుచెప్పినట్లు ఈ అల్విన్ మెటల్ వర్క్స్, ఎస్ బెస్టాస్ మొదలైనవి యింకా 3, 4 ఫ్యాక్టరీలు వున్నవి వాటిని సరిచేసేమార్గంకొరకు ప్రభుత్వం తీవ్రంగా ఆలోచిస్తున్నది. షేర్ మొత్తాన్ని పూర్తిగా తగ్గించి, రద్దుచేశారు. ఏదో ఒకటి చేయాలి. ప్రభుత్వం అప్పుగా యిచ్చిన షేర్ మొత్తాలుగాక, వాటిని బాగుపర్చాలని యిచ్చిన అప్పు మొత్తాలైనా వెనక్కు వచ్చేమార్గం కనబడడంలేదు. అందుకుగాను నాకు రెండు మార్గాలు కనిపిస్తున్నవి. ఒకటి, share మొత్తాన్ని రద్దుచేసో, తగ్గించో, కొత్తవాళ్ళను share holders గా తీసుకోడం అంటే కొత్తగా మొత్తంవచ్చే మార్గాల్ని ఏర్పరచడం. ఇప్పుడు మనం shares కు call for చేస్తే ఎవరూరారు. Insolvency అవుతున్న company లకు కొత్తగా shares కొనే వ్యాపారస్థు లెవరూ ఉండరు. ఆ షేర్ యొక్క వెలను దాదాపు పూర్తిగా తగ్గిస్తే అప్పుడు ఎవరైనా రావడానికి అవకాశం ఉంటుంది. ఆ మొత్తంతో ఏమైనా బాగుపరచే మార్గాలుంటే చూచుకోవడం ఒక మార్గం.

ఇక ప్రభుత్వమే invest చేసి, యిప్పుడు మనం direct గా తీసుకున్న కొన్ని లక్షలు వాటిపైన ఖర్చుపెట్టి managing agency స్వాధీనం చేసుకొనడం రెండవ పద్ధతి. కాని నూటికి నూరు పాళ్ళు ఈ company ప్రభుత్వానిది కాదు. లేకపోతే ప్రభుత్వమే ధైర్యంచేసి, 25,30 లక్షల వరకు ఖర్చుపెట్టి develope చేయడానికి కూడా మార్గాలున్నవి. మేజర్ షేర్లు ప్రభుత్వానికి ఉన్నవిగాని, total గా మనది కాదది. యింకా లక్షల రూ. లు sink చేస్తే అది వ్యాపార రీత్యా న్యాయమనిపించుకుంటుందా అనేది కూడా పరిశీలనలో ఉన్నది. మనం

మేరుయొక్క వెలను తగ్గిస్తే యిప్పుడిప్పుడు ధనంపెట్టి బాగుపర్చడానికి అనేక మంది సిద్ధంగా ఉన్నారు. పూర్తిగా తగ్గించి ఈనాడు మనం నష్టపడితే రేపు ప్రొద్దున్న ఈ వ్యాపారం అభివృద్ధియై ఈ company లు బాగాలాభం సంపాదించే నాటికి మనషేర్లు అన్నిపోయి ఉంటవి. ఈ సందిగ్ధావస్థలో యేమీ నిర్ణయం తీసుకోలేదు. Shares తగ్గించాలనే సలహానచ్చిన ప్రభుత్వం దానిని యింకా అంగీకరించడంలేదు.

సిర్ సిల్కు, సిరిపూర్ పేపర్ మిల్సులో షేర్లు ప్రభుత్వానికి 26%, ఉన్నవి. వాటి విషయం అంతా తెలియచేశాను. Share మొత్తమే కాకుండా ప్రభుత్వం హెచ్చుగా ఆ కంపెనీలకు అప్పులు యిచ్చింది. ఆ అప్పు మొత్తం మాత్రం యిప్పుడు దాదాపు కొద్ది కొద్దిగా వస్తున్నది. ఈ 2,3 సం. లలో బిర్లాగారు స్వాధీనంచేసుకున్న తరువాత 30,40 లక్షల రూ. లు అప్పు తీర్చినారు. ఇంకా అప్పుగా రావలసింది చాలాఉంది. దీనిని అభివృద్ధి చేయడానికి యింకా 1,2 కోట్ల రూ. లు ఖర్చుపెడితే అభివృద్ధి చేయడానికి మార్గాలున్నవని చెప్పారు. ప్రభుత్వానికి majority of shares లేవు కాబట్టి ప్రభుత్వం ఖర్చుపెట్ట లేదు. బిర్లావారికి దానిలో shares గాని, interest గాని హెచ్చుగా లేకపోవడంవల్ల వాళ్ళుకూడా డబ్బు invest చేయలేదు. అభివృద్ధి చేయడానికి possibility ఉంది. 50% కన్న ఎక్కువ తీసుకొనడానికి ప్రభుత్వం ఎక్కువ shares కొనాలా లేక మరెక్కడైనా loan సంపాదించాలా అనే విషయాలు కూడా ప్రభుత్వం ఆలోచనలో ఉన్నది. ఇంతవరకూ ఒక నిర్ణయానికి రాలేదు. ఇప్పటికి మేము తీసుకొన్న నిర్ణయాలు major things ను గురించి మాత్రమే. బోధన్ షుగర్ ఫ్యాక్టరీ, ప్రాగాటూల్సు, సింగరేణి, ఈ మూడింటిలో major shares ఉన్నవి. అందువలన ఈ విధంగా నడపాలని ఒక నిర్ణయానికి వచ్చాము.

ఈ ఇండస్ట్రీస్‌ను మూడు కేటగిరీస్‌గా విభజింపవచ్చును. గవర్నమెంటుకు మెజారిటీ షేర్సు ఉన్నవి మొదటి కేటగిరి. మెజారిటీషేర్లు కాకుండా 20 శాతము, 30 శాతము షేర్లు ఉండడం తరువాత లక్షల అప్పులు ఇవ్వడం జరిగినవి రెండవ కేటగిరి. షేర్లు ఏమీ లేవుగాని ఊరికే అప్పులిచ్చినవి మూడవ కేటగిరి. ఆ రకంగా మూడులక్షలో, 4 లక్షలో అప్పులిచ్చిన కంపెనీలు చాలా ఉన్నాయి. నేను నిన్న ఇచ్చిన స్టేటుమెంటులో గౌరవసభ్యులు చూచేఉంటారు. అసలవి తిరిగి వస్తాయని మనకేమీ ఆశలేదు. కృష్ణార్పణమే. వాటివల్ల మనకేదో వస్తుందనికాని ఆ పరిశ్రమలు అభివృద్ధి అవుతవనిగాని ఆశలేదు, అలాంటివి కొద్దిగా ఉన్నాయి. ఐతే అదృష్టమేమంటే, ఇటువంటివాటికి ఇచ్చినవి చిన్న మొత్తాలు. ఒక లక్షో, రెండు లక్షలో, మూడు లక్షలో మాత్రమే ఉన్నాయి. ఇప్పుడు ఉన్న పెద్దపరిశ్రమలను సేవ్ చేసుకుంటే వాటిని ఇంకా మంచిపద్ధతులలో నడపటానికి ప్రయత్నించేస్తూ చిన్నచిన్నవి నిదానంగా చూచుకుందామనే

దృష్టితో పరిశీలన చేస్తున్నాము. దేశంలో పెద్ద పెద్ద పరిశ్రమలు తయారవు తుంటే మనకు ఏమీ లేవే అని విచారము పట్టుకున్నది. అన్ని రాష్ట్రములలో ఏవేవో పరిశ్రమలు తయారవుతున్నాయి. మనరాష్ట్రంలో ఒక్కటైనా మేజరు ఇండస్ట్రీ పెట్టుకొనలేక పోయినామే అనే బాధకూడా లేకపోలేదు. ఈ విషయములో పూర్వపు హైదరాబాదు ప్రభుత్వము వ్రాసినది. ఢిల్లీకి మేమూ వ్రాశాము. యీ మధ్యన నాల్గయిదు నెలలకు పూర్వము హెవీ ఇండస్ట్రీస్ శాఖమంత్రి శ్రీ షా గారు ఇక్కడకు వచ్చినారు. వారేకాకుండా వారి శెక్రటరీలు ఉద్యోగులూ అంతాకూడా వచ్చారు. వారూ మేమూ కూర్చొని చర్చించుకున్నాము. ఒక విషయం మాత్రము వారు అంగీకరించారు. ఇప్పుడు రోతగా, చెడ్డగా ఉన్న ఇండస్ట్రీస్‌ను బాగుపరచడం ఒకటి. న్యూస్‌ప్రింటు ఫ్యాక్టరీని బోధన్‌లో పెట్టడానికి మంచి అవకాశాలు ఉన్నాయి కనుక అచ్చట ఆ ఫ్యాక్టరీని స్థాపించడానికి వారు వచ్చిన రోజుననే అంగీకరించారు. బోధన్‌లో న్యూస్‌ప్రింటు ఫ్యాక్టరీ పెట్టడానికి చాలా మంచి అవకాశాలున్నాయి. అక్కడ చెరుకుపిప్పి ఇప్పుడు బొగ్గుగా వాడుతున్నారు. ఆ పిప్పిని పొయ్యిలోవేసి వంట చెరుకుగా వాడుతున్నారు. ఆ పిప్పి కాగితము తయారుచేయడానికి చాలా మంచిదని అక్కడ పేపర్‌మిల్లు పెడితే 20, 30, 50, 100 మైళ్ళనుండి ముడిపదార్థము తెచ్చుకోనక్కరలేదని భావించబడింది. రాజమండ్రి పేపరు మిల్లుకు ఎక్కడనుంచో ఒకటన్ను కేన్ తెస్తే దానికి దాదాపు 200 రూపాయలు ఖర్చు అవుతున్నది. బొంగుఖరీదు తక్కువగా ఉన్నా ట్రాన్సుపోర్టు ఛార్జీలు లేబరు ఖర్చులూ ఎక్కువ అవుతున్నవి. అలాంటి హెచ్చుఖర్చు లేకుండా ఆ పిప్పి బోధన్‌వద్ద ప్రక్కనేఉన్నది. ఆ పిప్పితో పేపరు తయారుచేస్తే తక్కువ ఖరీదుతో తయారు కావడానికి వీలవుతుందని అంగీకరించారు. అందులో ఏ 10 ఫ్యాక్టరీలనుంచో పిప్పి తెచ్చుకోనక్కరలేకుండా ఒక పెద్ద గవర్నమెంటు ఫ్యాక్టరీలో ప్రక్కనే పిప్పి ఉండడం అనుకూలంగా కనిపించింది. కాబట్టి యీ కారణంవల్లనే, మనపైన అభిమానము లేకపోయినా, కనీసం అక్కడ న్యూస్‌ప్రింటు ఫ్యాక్టరీ పెట్టడానికి సదవకాశాలున్నాయని అంగీకరించారు. ఆ విధంగా అంగీకరించినా ఈ షుగర్‌ఫ్యాక్టరీవారు కూడా ఏమైనా షేర్లు కొంటారా అని అడిగినారు. షుగరు ఫ్యాక్టరీవారు ఒక కోటిరూపాయల షేర్లు వారి ఫ్యాక్టరీ తరపున తీసుకోవాలన్నారు. ఆ ఫ్యాక్టరీ తరపున కోటిరూపాయల షేర్లు తీసుకునేపరిస్థితిలో లేము అని వారు చెప్పినప్పుడు నగదు రూపకంగా 25 లక్షలిచ్చి మిగిలిన 75 లక్షలూ యీ పిప్పికిబదులు ఖరీదునుంచి కొంతభాగాన్ని షేరు కాపిటలుక్రింద అడ్జస్టు చేసేటట్లుగా అంగీకరించాము. అంటే ఈ పిప్పిని పేపరు ఫ్యాక్టరీకి ఇవ్వడము వల్ల షుగర్‌ఫ్యాక్టరీకి ఫైర్‌ఫుడ్ క్రింద వాడుతున్న మెటీరియల్ పోతుంది. ఆ మెటీరియలు పోవడమువల్ల బొగ్గుతో వర్కు చేయవలసి ఉంటుంది. బొగ్గు కావలసి వస్తున్నది. ఆ బొగ్గు

ఖరీదు పోను మిగిలినదంతా షేరు కాపిటలుక్రింద ఇవ్వడానికి ఒప్పుకున్నాం. అంటే బెగస్ ఖరీదులో మనము కొనవలసివచ్చే బొగ్గుఖరీదు తీసివేస్తే మిగిలినదంతా షేరు కాపిటలుక్రింద ఇవ్వడానికి - అది ఎప్పటికో ఒకప్పటికి 75 లక్షల రూపాయలు షేరు కాపిటలు అవుతుందికదా అని-ఒప్పుకున్నాము. ఆ రకంగా ఏర్పాటు చేసుకొన్నాము. దానిని ఢిల్లీప్రభుత్వంవారు అంగీకరించారు. అన్నిటికన్నా ముఖ్యముగా నేను పలుమార్లు చెబుతున్నాను, ఫర్టిలైజరు ఫ్యాక్టరీ మా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో కావలెనని. ఎక్కడెక్కడ నుంచో ఇక్కడకు ఎరువులు ఇంపోర్టు చేయడంకన్నా, ట్రాన్సుపోర్టు బాటిల్ నెక్ వగైరాలన్నీ ఉన్న యీ సమయంలో ఫర్టిలైజర్సును సకాలంలో రైతులకు ఇవ్వకుండా ఏ రెండు నెలలో, 3 నెలలో ఐనతర్వాత పైరు కోతకు వచ్చే సమయంలో ఫర్టిలైజర్సును సప్లయిచేయడంకన్నా ఇక్కడనే ఫ్యాక్టరీని పెడితే ఇలాంటి ఇబ్బందిలేకుండా ఉంటుందని చెప్పాను. 2, 3, 4 లక్షల టన్నులవరకూ ఫర్టిలైజర్సును కన్స్యూమ్ చేసే కెపాసిటీ ఆంధ్రదేశంలో ఉన్నదని చెప్పాము. పూర్వపు ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము, హైదరాబాదు ప్రభుత్వము కలిసి ఈ విషయంలో వత్తిడిచేశాయి. కొత్తగూడెంలోకాని, విజయవాడలోకాని పెట్టమని కోరినాము. కట్టకడపట ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వములో ఉన్న గోపాలరెడ్డిగారి మంత్రివర్గము "మాకువద్దు విజయవాడలో, కొత్తగూడెంలోనే పెట్టండి, మాకు ఆక్షేపణలేదు" అని చెప్పారు. అటు కొత్తగూడెంకు రాలేదు, ఇటు విజయవాడకూ రాలేదు. ఏవో యితర చిన్న కారణములు పెట్టుకుని యితర రాష్ట్రములకు పోయినాయి. మద్రాసు రాష్ట్రంలోని నెయివెల్లీలో ప్రారంభిస్తామన్నారు, అక్కడ ఏదో రా మెటీరియల్ ఉన్నదనే కారణంవల్ల. కొత్తగూడెంలో పెడితే చాలా అనుకూలంగా ఉంటుందని అనుకుంటున్నాము. దానిని గురించి మరీమరి ప్రస్ చేశాము. కాని అది వచ్చే సూచనలు ఇపుడేమీ కనపడడంలేదు. ఇండస్ట్రియలిస్టు ఎవరైనా ప్రయివేటు సెక్టారులో పెట్టుకుంటే పర్మిషన్ తెప్పించడానికి ప్రయత్నం చేస్తామని మాత్రము చెబుతున్నాను. ఇదికాక ఆంధ్రా పేపరుమిల్లు యొక్క కెపాసిటీని పెంచటానికి మిత్రులు వెంకటరావుగారు ఆంధ్రరాష్ట్రములో ఇండస్ట్రీస్ మినిష్టరుగాఉన్న రోజులలోనే ఆ స్కీము తయారుచేశారు. దానిని గవర్నమెంటు ఆఫ్ ఇండియావారు కూడా అప్రూవ్ చేశారు. అక్కడ ప్రొడక్షనును ఇంక్రీజు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇదీ ఇండస్ట్రీస్ విషయం. మంచి ఇండస్ట్రీసును స్థాపించారిక్కడ. దేశానికి చాలా ఉపయోగకరమైన పరిశ్రమలను ప్రారంభించారు. సదుద్దేశములతో ప్రారంభించారు. ఇది సంతోషింపతగిన విషయం. కాని దురదృష్టవశాత్తూ అవి సరిఅయిన చేతులలో లేకపోవడంవల్లనో, ప్రాపర్ మేనేజిమెంటు లేకపోవడంవల్లనో కొద్దిగా చెడిపోయినాయి. చెడిపోయినదానికి విచారించడం కన్నా, పాతకాలాన్ని గురించి వాపోవడంకన్నా ముందుకాలాన్ని

దృష్టిలో ఉంచుకొని వాటిని బాగుపరచే అవకాశాలున్నాయని మనము సంతో షించవచ్చు.

ఇక మోటారు ట్రాన్సుపోర్టు విషయం ఉన్నది. హైదరాబాదు అన్నిటి లోనూ మునుపటి రోజులలో ముందంజవేసినది. మొట్టమొదటినుంచీ కూడా నేషనలైజ్డ్ ట్రాన్సుపోర్టు ఉన్నది ఇక్కడ. దానిని ప్రభుత్వమే నడుపుతున్నది. రైల్వేస్‌ను కూడా ప్రభుత్వమే నడుపుతుండేది ఆ రోజులలో. రైళ్ళు, మోటార్లు ఒక కంపెనీక్రింద ఫారమ్‌చేసి బాగా నడుపుతూవచ్చినారు. ఇతర రాష్ట్రములలో ప్రైవేటు ఓనరులు నడిపే పరిశ్రమకన్నా ఇక్కడ జాతీయంచేసి ఎఫిషెంటుగా నడుపుతున్నారని అనుకునేవారు. టైముకు సరిగా పోవడం, పాసింజెర్లకు సౌకర్యములు ఏర్పాటుచేయడం మంచి వర్కుషాపులను మేన్‌టేన్ చేయడం, డ్రైవర్సుకూ కండక్టర్సుకూ మంచి జీతాలు - ఏ రాష్ట్రములోనూ ఎక్కడా కూడా ఇవ్వలేనంత మంచిజీతాలు, హెచ్చుజీతాలు ఇవ్వడం జరుగుతు న్నాయి. ఇప్పటికీ ట్రాన్సుపోర్టు జాతిపరంగానే ఉన్నది. రైల్వేస్‌నుంచి విడ దీశారు. విడదీసిన దాని ఫలితమేమంటే — రైల్వేలో ఉన్న హెచ్చు జీతాలూ హెచ్చు ఖర్చులూ అట్లనే ఉండిపోయినాయి. చాలా మంది మిత్రులు ఇక్కడ ట్రాన్సుపోర్టు శాఖను గురించి మాట్లాడినారు, మద్రా సులో, ఒక్క పట్టణములో 25 లక్షల రూపాయలు బస్సు వ్యాపారము పైన ఆదాయము వస్తున్నప్పుడు హైదరాబాదు సిటీతో చేర్చి తెలంగాణా ప్రాంతమంతటిలో మోటారు ట్రాన్సుపోర్టును జాతీయం చేసినా, ఎందువల్ల ఇక్కడ ఆరేడు లక్షల రూపాయలు మాత్రమే వస్తున్నదని అడిగారు. ఈ ప్రశ్ననే నేనూ వేసుకున్నాను ముందు. ఇంత పెద్ద దేశంలో ఇన్ని బస్సులు పెడితే ఆరు లక్షలో, ఏడు లక్షలో ఆదాయంరావడం ఏమిటి ? ఒక్క మద్రాసు పట్టణంలో 20 లక్షలకు తగ్గకుండా 22 లక్షలవరకూ ప్రతి సంవత్సరమూ ఆదాయం ఏలావస్తున్నది ? అనేది నాకు అర్థంకావడం లేదు. నేనూ విచారిం చాను. ఇంకా డిటైల్డుగా చూడలేదు. చూడడానికి ఇంకా ప్రయత్నం చేస్తాను. రఫ్‌గా విచారిస్తే దానికి కారణాలు కొన్ని ఉన్నట్లు తోస్తున్నది. ఉద్యోగస్థు లకు, అంటే డ్రైవర్లకూ, కండక్టర్లకూ, క్లీనర్లకూ ఎవరైనా కాని మోటారు ఉన్న వర్కుమెన్‌కు మద్రాసులోగాని, బొంబాయిలోగాని, ట్రాన్సుపోర్టు శాఖలో పనిచేస్తున్న డ్రైవర్సు, కండక్టర్సు, క్లీనర్సు యొక్క జీతాలకన్న ఇక్కడ దాదాపు రెండింతల జీతమివ్వబడుతున్నది. రెండింతలంటే ఎగ్జాక్టుగా కాకపోవచ్చు. హెచ్చు జీతాలివ్వబడుతున్నాయి. కాబట్టి యీ వచ్చే ఆదాయం ఆ రకంగా పోతున్నది. మద్రాసులో చాలా తక్కువ జీతాలు ఉన్నాయి. అను కూలాలు సదుపాయాలు మిగిలిన వసతులు చాల తక్కువని చెప్పారు. దానికి నేను ఒకటి రెండు నిదర్శనాలు నావద్దకు ఫైల్సు వచ్చినప్పుడు చూచాను.

ఎవరో ఒక ఉద్యోగస్తుడు ఎక్కడో ఉంటే— ఆ ఉద్యోగస్తునికివంద రూపాయలు జీతము కావచ్చు. ట్రాన్సుపోర్టు శాఖలో— ఆ ఊరిలో సరయిన స్కూలు లేదన్న కారణంవల్ల ఆ ఉద్యోగస్తుడు తన పిల్లవాళ్ళను హైద్రాబాదుకు పంపిస్తే ఆ పిల్లవాళ్ళకు జీతాలేకాకుండా, మిగిలిన ఎలవెన్సులే కాకుండా, చదువు నిమిత్తం వేరే ఖర్చులు భరించాలి.

జీతాలు, allowances మాత్రమే కాకుండా, చదువు సంధ్యలు వంటి extra-ordinary benefits కొన్ని అందులో ఏర్పాటుచేశారు. ఖర్చుకూడా ఎక్కువగానేఉన్నది. మద్రాసుతోగాని, బొంబాయితోగాని పోల్చిచూచుకొంటె, మన transport ఖర్చు అధికంగానే ఉన్నది. ఈ drivers, conductors విషయములోనే నని నేను అనను. ఇంకా officials లోకూడా క్రిందనుంచి పైవరకుకూడా ఇట్లాగేఉంది. కాని ఆమాత్రానికే ఇంతతేడా రావలెనా, మద్రాసులో వారు ఒక సిటీలోనె ఇన్నిలక్షల రూపాయలు ఆదాయం సంపాదిస్తూంటె, తెలంగాణాలో, అంతాకూడ మనం transport ఏర్పాటుచేసుకొని, హైదరాబాదు సిటీమొత్తానికి buses పెట్టుకొని ఉంటున్నప్పుడు, ఇంతకొద్ది ఆదాయం తీసుకోడంలో ఏమైనా అర్థంఉన్నదా అనే ఆలోచన నాకుకలుగుతుంది. ఈవిషయంలో ఉద్యోగులు ఇచ్చేసమాధానం నాకు తృప్తికరంగాలేదని అనుకొంటున్నాను. దీనిని ఇంకా పరిశీలనచేయాలి. అనుభవజ్ఞుల నెవరినైనా పంపో లేక మన Department లో ఉన్నవారినెవరినైనా పంపో, అక్కడ ఏయే Loopholes ఉన్నాయి, ఎక్కడ ఎంత wastage ఉంది, ఏవిధంగా నష్టమవుతూంది. అని minute details అన్నీ, study చేయాలి. తరువాత మన ఆంధ్ర ప్రాంతములోకూడా బాగాలాభాలు వచ్చేటటువంటి క్రిష్ణా, గుంటూరు వగైరా జిల్లాలకుకూడా ఈ transport extend చేస్తే హెచ్చులాభము సంపాదించడానికి వీలుఅవుతుంది అని పలువురు మిత్రులు చెప్పుతూఉంటారు. కాని ఇక్కడ transport అభివృద్ధిచేయడానికి ఇంకా హెచ్చుడబ్బుకావాలని కోరినప్పుడు ఢిల్లీప్రభుత్వము అప్పుఇవ్వడానికి అంగీకరిస్తూ దీనికి ఏదో కొన్ని conditions పెట్టారు. దీనిని ఈ రకంగా నడపాలి. దీనికి ఒక corporation పెట్టండి, అదిపెట్టండి ఇది పెట్టండి అని ఏవో conditions పెట్టారు. అప్పుడు ఆ ప్రభుత్వముఈ corporation పెట్టడానికి ఒప్పుకోలేదు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ఏర్పడినతరువాత, ఈ ప్రశ్న మాముందుకు వచ్చినప్పుడు, ఈ ప్రభుత్వము కూడా వెంటనే ఈ corporation చేయడానికి అంగీకరించలేదు. కాని ప్రాంతీయ corporation చేయడంవల్ల లాభము ఉంటుందేమో, కొన్నిజిల్లాలలోనైనా బస్సులు జాతీయము చేయడానికి వీలుంటుందేమోనని, ఆవిషయము ఇప్పుడు పరిశీలన జరుగుతున్నది. ఏమైనాసరే, corporation అనండి, జాతీయం అనండి దేనికైన డబ్బుకావాలి. బస్సులు తీసుకొన్నప్పుడు, ఆ బస్సుల యజమానులకు

compensation ఇవ్వాలి. బస్సు రూట్లు అన్నీ స్వాధీనం చేసుకొన్నప్పుడు, రూట్లు మాత్రము తీసుకొని, వారి బస్సులు తీసుకోకపోవడం అన్యాయముగా అగుపడుతుంది. ఆ రూటుపైన ఉన్న బస్సును స్వాధీనం చేసుకోకుండా ఉండ డానికి వీలులేదేమో, అది చట్ట సమ్మతం కాదేమో అనుకుంటాను. కనుక ఆ బస్సు, రూటు, అన్ని స్వాధీనం చేసుకొని, ప్రతి owner కు ఏ లక్ష రూపాయలో pay చేసి, కనీసం కొందరిని share holders గా తీసుకొని corporation గా చేయాలన్నా, రెండు కోట్లు రూపాయలు అయిన ఉంటేనేగాని ఈ పని చేయ డానికి వీలులేదు అని సలహా ఇచ్చారు. ఇప్పటి పరిస్థితులలో దీనికిగాను రెండు కోట్ల రూపాయలు ఖర్చుపెట్టే స్థితిలో మనము లేమేమో అనుకొంటున్నాను. పోనీ, రెండు కోట్లకంటె తక్కువగా పెట్టి, ఏవో కొన్ని రూట్సు మాత్రం, అంటె మచిలీపట్నం లాంటి straight routes ఏవైన కొన్ని మాత్రం తీసుకో డానికి వీలుందేమో అది legal గా examine చేయించాలి. కాని, ఆ bus routes లో ఇప్పుడు ఉన్నవారిని తీసివేయడం అది ఎంతవరకు legal గా ఉం టుందో అదికూడా పరిశీలన చేయాలి. ఇదంతా కొంత confusion లో ఉన్నది. ఏదో file చదువుతూనే అర్థమయ్యే విషయం కాదిది. ఏ చెరువు కట్ట కట్టడమో, లేక ఏ hospital కట్టడమో వంటిది కాదిది, వెంటనే decision తీసుకోడానికి. ఇప్పుడు asbestos వగైరా కంపెనీలలోఉన్న shares యొక్క వెల తగ్గించవలెనా, లేక capital పెంచవలెనా, లేక ప్రభుత్వమే capital పెట్ట కలుగుతుందా అనే సమస్యలపై, నిజం చెప్పాలంటే, నేను ఈనాటికి ఏమి decision తీసుకోలేక పోతున్నాను. నేను ఏదైనా ఒక నిశ్చయానికి వస్తే దానిని Cabinet కు refer చేయడం, మిత్రుల సలహాలు తీసుకోవడం జరుగు తుంది. అవి కొంచెము చిన్న కంపెనీలు కాబట్టి వాటి విషయం తరువాత చూడవచ్చునని నెట్టివేస్తున్నాను. మొదట ఈ పెద్దవి కానిమ్మని, అందులో మనరాష్ట్రము Industries లో అనుభవముగల రాష్ట్రము కాదు. ఈనాడు అన్నీ స్వాధీనం చేసుకొంటె, ఎవరిని వేయాలి అక్కడ మనము? అక్కడ ఎవరినో M. L. As ను appoint చేయడమో, లేకపోతే ఒక కలెక్ట రును తీసుకొనిపోయి, 'ఇదిగో ఈ industries అన్నీ నీకు అప్పచెప్పు తున్నామని' చెప్పడమో కాదు. వారికి ఏమి అనుభవమున్నది? ఇప్పుడు బోధన్ ఫ్యాక్టరీ లో మనం ఒక ఉద్యోగస్థుని నియమించ దలచుకొన్నాము, కనుక అక్కడ ఎవరినో ఒక కలెక్టరునో, లేక, ఎక్కడో retire అయిన ఒక businessman నో, లేక honesty and integrity గల పెద్ద మనిషినో వేయడమా! పెద్దమనుష్యులను వేయవచ్చు, కాని కొంచెము adminis-tration and business experience ఉంటె ఉపయోగముంటుంది. ఇవిలేని వాళ్ళను అక్కడ తెచ్చిపెడితే చాలా కష్టము. ఈ industries అన్నీ ప్రభుత్వము స్వాధీనం చేసుకోవాలి అని సులభముగా చెప్పవచ్చుగాని, స్వాధీనం చేసుకొన్న

తరువాత ఏమి చేయాలి? అందులో ఈ కంపెనీలలో ఎంతో నష్టము వచ్చింది. అవి మురిగిపోయినాయి, capital లేదు. అటువంటప్పుడు వీటిని ఏవిధంగా చేయాలి! నిజంగా, ఇలాటి చిన్నచిన్న కంపెనీలను గురించి వెంటనే ఒక నిర్ణయానికి రాలేకపోతున్నానని మాత్రమే చెప్పుతున్నాను. మీరేమైనా సలహా ఇస్తే చాలా సంతోషిస్తాను. పెద్దవాటిని గురించి ఏదో ఒక నిర్ణయం తీసుకొన్నాము. తప్పో రైటో ఒక నిర్ణయం తీసుకొన్నాము. ఈ బోధన్ Factory గురించి, సింగరేణి Factory గురించి, ఈలాంటి వాటిలో ఇక Aluminium Metal Works ఇలాంటి మధ్యరకపు industries ఉన్నాయి. వాటిని ఎట్లాచేస్తే బాగుంటుంది? Critical గా కాకుంటే, constructive గా suggestion చెప్పండి. ఈ విషయంలో ప్రభుత్వానికి సలహా యివ్వడానికిగాను ఒక Advisory Committee ని appoint చేస్తామని నేను అనుకొంటున్నాను. ఈ Industries లోను, business లోను బాగా అనుభవము ఉన్నవాళ్ళను కొంతమందిని, ఇంకా కావలసివస్తే ఒకరిద్దరిని M. L. As. ను కూడా తీసుకొని ఒక Advisory Committee ని వేసుకొందామని అనుకుంటున్నాను, కనుక మీరు ఇచ్చే సలహాలు అటు ఉద్యోగస్థులు పరిశీలనచేస్తారు. ఇటు Advisory Committee పరిశీలన చేస్తుంది. తరువాత అవి మంత్రివర్గము ముందుకు పోతాయి, అప్పుడు అక్కడ ఏదో ఒక నిశ్చయానికి రావడానికి వీలవుతుంది. కనుక ఈ విషయాలలో నెమ్మదిగా ఏదైనా చేయవలసి యుంటుందేగాని వెంటనే అన్నిటిలోను ఒక decision తీసుకోవాలి. రేపు ప్రొద్దునకే ఇవన్నీ మార్చివేయాలి అని ఏదోఒకటిచేస్తే, ఇప్పుడు జరిగిన తప్పులకన్నా నాలుగింతలు తప్పులు జరుగుతాయి. ఎవరినో తీసుకొనిపోయి అక్కడపెట్టి ఏదో మంచి చేస్తున్నాము, మనము పెట్టినవారంతా న్యాయంగానే చేస్తారు, సక్రమంగానే చేస్తారు, అనుకోవడం పొరబాటు. ఇక్కడ మనఇంటిలోనే మన Secretariat లో, మన అసెంబ్లీలో ఎన్నో అక్రమాలు జరుగుతుంటె, వాటిని మనము కనుక్కోలేక ఏడుస్తూఉంటె, ఎక్కడనో పెట్టినటువంటివి అవన్నీ సక్రమంగా జరుగుతాయని అనుకోవడం పొరబాటు అవుతుంది. ఈ కారణంవల్లనే నేను తొందరపడి వెంటనే ఏమి చేయలేదు. నాకు తెలుసును. గౌ. సభ్యులు ఉపన్యాసాలు ఇచ్చేటప్పుడు, మీరు ఇన్నాళ్ళుగా పరిపాలన చేస్తున్నారు, మరి వీటి విషయంలో ఇంకా ఏమిచేయలేదే అని అంటారని. కాని తొందరపడి చేస్తే కష్టపడతాము అనే భయముతోనే ఈ నాటికి నేనేమి చేయలేదని చెప్పుతున్నాను. Decision తీసుకోవడం పెద్ద పనికాదు. ఏదో file వస్తే వెంటనే దస్కత్ పెడితే, ఏదోఒకటి అయిపోతుంది. కాని దానివల్ల ప్రయోజనంలేదు. కనుక ఈ విషయంలో తొందరపడకుండా, సరియైన సలహాలను తీసుకొని అందరు బాగా ఆలోచించిన తరువాత ఒక నిశ్చయానికి వస్తే బాగుంటుందని అనుకొంటున్నాను. అందువల్ల గౌరవసభ్యులు ఇచ్చిన సలహాలను జాగ్రత్తగా

ఆలోచించి, Advisory Committee ద్వారా ఆలోచించి, industrialists యొక్క సలహాలు పొంది, తరువాత Cabinet లో decision తీసుకొని రానున్న సంవత్సరములోనైనా వీటిని ఏదో ఒకదారికి తీసుకొని రావలెనని అనుకుంటున్నాను. ఇవన్నీ ఒకదారికి తీసుకురాగలిగితే, కొత్త పరిశ్రమలు పది స్థాపించిన పుణ్యం వస్తుంది.

దీనికితోడు కొంతలాభము వస్తున్న factories లో Labour position బాగాలేదని నాకు complaints వచ్చాయి. వారికి జీతాలు భత్యాలు సరిగా ఇవ్వడంలేదని complaints వచ్చాయి. ఈ విషయం నాకు సంబంధం లేక పోయినా సంజీవయ్యగారు నాతో చెప్పారు. నేను ఈ విషయం గురించి ఆ పరిశ్రమలకు సంబంధించిన వారితో చెప్పాను. ఈ రకంగాచేస్తే బాగుండదని. రాజమండ్రిలోకూడ తగాదా వచ్చింది. ఒక ఉద్యోగస్తుని అక్కడకు పంపాను. న్యాయంగా లెక్కవేస్తే వచ్చిన ఆదాయములో workers bonus 4, 5 రోజులకే ఇవ్వవలసియుంటుందని వారు అన్నారు. కాని నేను చెప్పాను, 4, 5 రోజుల కెందుకిస్తారు, ఒకనెల రోజుల bonus అయినా ఇస్తాము. తరువాత లెక్కలేవో adjust చేసుకోవచ్చునని. 1948 సంవత్సరంలో ఈ factory స్థాపిస్తే, ఇప్పుడు మొదటిసారిగా ఆదాయం వచ్చింది. కాని కొంతమంది చెప్పారు, కనీసం last year వచ్చిన నష్టాన్నైనా తీసిపెట్టి మిగిలినటువంటిది bonus క్రిందను, లాభము క్రిందను పరిగణించాలి. వచ్చిందంతా లాభము అనేది తప్పు. అది proper accounting కాదు అని నేను చెప్పాను. "ఏమైనాసరే ఒకనెల యిస్తామని declare చేయండి. తరువాత లెక్కలు సర్దుకొందాము. Technical గా చూస్తే నాలుగు రోజులకు bonus ఇవ్వడమే న్యాయంకావచ్చు. కాని దీంట్లో frist time లాభము వచ్చింది, ఇన్నేళ్ళ తరువాత. కనుక ఒకనెల బోనసు సంతోషపూర్వకంగా ఇస్తామని" చెప్పాను. తరువాత ఆరు రూపాయలు వారికి ఇచ్చే విషయం నిన్ననే సంజీవయ్యగారు explain చేశారు. వారికికూడ ఈ ఆరు రూపాయలు ఇవ్వవచ్చునేమో అనుకొన్నాము మొదట. వారు గవర్నమెంటు labour కాబట్టి ఇప్పుడు అందరికి ఇస్తున్న ఆరు రూపాయలలో Gevernment of India వారు two - thirds భరిస్తుందనేవిషయం తమకు తెలుసు. One-third State Government భరిస్తుంది. ఆ one - third భరించేందుకే మనకు ఎంతో అవుతుంది, అంటె 70, 80 లక్షలు అవుతున్నది. అయినా వీరికి కూడా ఇవ్వడానికి మేము సిద్ధంగా ఉండినాము కాని, వారికి ఇవ్వడానికి వీలులేదని యీ మధ్యనే Government of India వారినుంచి ఒక telegram వచ్చింది. One-third ఇవ్వడానికే మనకు కష్టంగా ఉన్నప్పుడు Government of India వారి సహాయంలేకుండా complete గా అదంతా మనమే భరించాలంటె ఎంత అవుతుందో ఆలోచించండి. కాబట్టి యివ్వాలని ఆశవున్నాసరే, industrial labour కు

temporary labour కు P. W. D. Workshop లో వున్నవారికి, యిది కవర్ (cover) కానందున, రు. 6/- లు యివ్వలేకపోతున్నాము. కొన్నిఏండ్లుగా నిలబడి పనిచేస్తూ లాభమువస్తున్న ఫ్యాక్టరీలలో కొద్దిగా యివ్వవచ్చును. అటువంటి ఫ్యాక్టరీలలో వర్కర్లకు ఎక్కువ అనుకూలాలు కలుగచేయాలని, ఉద్దేశం వున్నది. అభివృద్ధిఅవుతున్న పరిశ్రమలలో పాటుబడుతున్న వ్యక్తులకు సానుభూతి చూపిస్తూ కొంతసహాయము చేయించాలని మాకు ఆశగావున్నది. గూడూరు సిరమిక్సు ఫ్యాక్టరీలోమాత్రం మంచి లాభంవచ్చింది. కార్మికులకు బోనస్ ఇచ్చారు. అక్కడనే గ్లాస్ బ్లాక్ ఫ్యాక్టరీ పెట్టారు. నష్టమువచ్చింది. పెట్టిన డబ్బు ఖర్చు అయిందిగాని పనిజరగడంలేదు. గడచిన సంవత్సరం మూసివేశారు. ఇవి ఆంధ్రప్రాంతములోవున్న పరిశ్రమలు.

ఈ పరిశ్రమల డిమాండు, ట్రాన్స్‌పోర్టు డిమాండు మీముందు వుంచుతున్నాను. గౌ. సభ్యులు ఏమైనాసలహాలుయిస్తే వెంటనే అంగీకరిస్తానని చెప్పలేనుగాని పరిశీలిస్తానని చెప్పగలను. సభ్యులుకూడ యోచించి, కోట్లకొలది రూపాయలు వెచ్చించవలసిన సలహాలు కాకుండా, ఆచరణ యోగ్యమైన సలహాలు, ఏ పార్టీవారయినప్పటికీ, అటువంటి సుహృద్భావంతో యిస్తే, పరిశీలించి, అందులో అనుకూలమైనవాటిని అంగీకరించడానికి ప్రభుత్వంసిద్ధంగా వుంటుందని చెపుతూ, దీనిపైన చర్చ ప్రారంభించవలెనని కోరుతున్నాను.

శ్రీ టి. అంజయ్య (ఆర్మూరు): Taj Glass Works, Old Mills లాంటి close అయిన పరిశ్రమలవిషయంలో ముఖ్యమంత్రిగారు ఏమీచెప్పలేదు.

శ్రీ యన్. సంజీవరెడ్డి : గౌ. సభ్యులకు నిన్నఅందజేసిన కాగితంలో అన్ని విషయములున్నవి. ఆ వివరాలన్నీ సభ్యులుచదువుకొని, సంగతులు గ్రహించుటకు ముందుగా పంపివున్నాము. కాబట్టి మళ్ళీయిప్పుడు చెప్పుట అనవసరం.

*DEMAND NO. XXIII - INDUSTRIES* — *Rs.* 1,63,49,200

*Sri. P. Sundarayya* (*Gannavaram*) *:* I beg to move :

To reduce the ollotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To criticise the failure of the Government to start new Industries in the Public Sector to industrialise Andhra Pradesh and also their action in handing over the existing Industries to the Private Management of the Capitalists.)

*Mr. Speaker* : Motion moved.

*Sri S. Vemayya* (*Buchireddipalem - Reserved*) : I beg to move :

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To criticise the delay made by the Government to implement the terms of the conciliation regarding the dispute between the porcelin factory workers and the managements in Nellore district and in respect of the enhancement of the salaries of the labourers.

*Mr. Speaker:* Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya (Sattenapalli):* I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To constitute State Trading Corporation to trade with other States or Countries of the products of this State which are now being sent by individuals.)

*Mr. Speaker:* Motion moved.

*Sri M. Nagi Reddy (Macherla):* I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To criticise the failure of the Government to take action on the petitions submitted by the Union against the removal of the labourers working from the beginning at cement factory Macherla and replacement of them by new workers.)

*Mr. Speaker:* Motion moved.

*Sri S. Vemayya:* I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To discuss the failure of the Government to amend the Act suitably so as to ensure quick settlement of disputes between the labour and the managements.)

*Mr. Speaker:* Motion moved.

*Sri B. P. Sesha Reddi (Dhone):* I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To discuss the maintenance of the technical experts for each and every concern of Industry.)

*Mr. Speaker:* Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya:* I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To know the fuller details of the loans and subsidies given to the Cottage Industries and Medium Industries and other Industries.)

*Mr. Speaker:* Motion moved.

*Sri B. Ratnasabhapathy* (*Badevel*) *:* I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To criticise Government on its policy of affording huge loans to private industrialists at cheap rate of interest.)

*Mr. Speaker*: Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya*: I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To criticise the Industrial policy of the Government.)

*Mr. Speaker*: Motion moved.

*Sri B. Ratnasabhapathy:* I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To criticise Government on its failure to nationalise the Bodhan Sugar Factory in which Government have 75% shares.)

*Mr. Speaker:* Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya*: I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To impress upon the Government to start a cement factory at Vijaipuri, on public sector.)

*Mr. Speaker*: Motion moved.

*Sri M. Nagi Reddi*: I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To discuss the failure of the Government to take steps to start a cigarette factory in the State.)

*Mr. Speaker:* Motion moved.

*Sri M. Nagi Reddi:* I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To discuss the failure of the Government to take steps to start a fertiliser factory in the State.)

*Mr. Speaker*: Motion moved.

*Sri B. Ratnasabhapathy:* I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To criticise Government's policy.)

*Mr. Speaker:* Motion moved.

*Sri S. V. K. Prasad (Chennur)*: I beg to move:

To reduce the allolment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To discuss:

(1) The wrong industrial policy of handing over Government concerns to private management and the mismanagement of Government Industries.

(2) Failure of Government to follow a policy of rapid industrialisation of Andhra Pradesh.)

*Mr. Speaker:* Motions moved.

*Sri M. Nagi Reddi:* I beg to move:

To reduce the allotment of Rs. 1,63,49,200 for Industries by Rs. 100

(To criticise the practice of the Maistries of the Cement Factory, Macherla, not to maintain the muster rolls for labourers and also their failure to recognise senority.

*Mr. Speaker:* Motion moved.

*DEMAND NO. XXXIV for Road Transport Dept. Rs.* 1,85,37,500

*Sri B. Ratnasabhapathy:* I beg to move:

To reduce allotment of Rs. 1,85,37,500 for R. T. D. by Rs. 100

(To criticise Government policy.)

To reduce allotment of Rs. 1,85,37,500 for R. T. D. by Rs. 100

(To criticise Government in giving preferential treatment to some with regard to the issue of Bus Routes.)

*Mr. Speaker*: Motions moved.

*Sri M. Nagi Reddi:* I beg to move:

To reduce allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss the failure of the Government to increase the number of State Buses.)

*Mr. Speaker:* Motion moved.

*Sri Pillalamarri Venkateswarlu (Nandigama):* I beg to move:

To reduce allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss the inconvenience suffered by the passengers for want of proper seating arrangements in buses.)

To reduce allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss the failure of the Government to take steps to entrust the Road Transport in Andhra area to a Transport Corporation formed with share capital contributed by the bus owners and the Government jointly.)

*Mr. Speaker:* Motions moved.

*Sri M. Nagi Reddi:* I beg to move:

To reduce the allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss the failure of the Government to raise the number of buses from Guntur, Narasaraopet & Vinukonda to Nagarjunasagar and from there to the said places in spite of the severe inadequacy felt with the increase of traffic on account of the construction of Nagarjunasagar.)

To reduce the allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss the failure of the Government to take any action on the petitions submitted regarding the inconvenience suffered by the public as a night halt for the buses between Vinukonda and Nagarjuna-Konda and between Vinukonda and Nagarjuna-sagar are at the same place.)

To reduce the allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss the failure of the Government to provide more facilities for travel by increasing the number of buses between Macherla and Nagarjunasagar.)

To reduce the allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss the failure of the Government to sanction a new bus route between Macherla and Nagarjunakonda and run buses to provide better facilities of travel for the passengers.)

*Mr. Speaker*: Motions moved.

*Sri K. L. Narsimha Rao*: I beg to move:

To reduce the allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss the working of the Road Transport Department and the failure of the Government to nationalise the same throughout the State.

*Mr. Speaker:* Motion moved.

*Sri D. Narsaiah (Yellandu-Reserved)*: I beg to move:

To reduce the allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss the failure of the Government to extend the Huzurnagar-Lingagiri bus service upto Yathâvakilla.)

*Mr. Speaker;* Motion moved:

*Sri B. Dharma Bhiksham (Nakrekal)* : I beg to move:

To reduce the allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss the failure of the Government to increase the number of R. T. D. Buses in Nalgonda District, to nationalise the R.T.D. and the failure of the R. T. D. to introduce new bus routes in Telengana.)

*Mr. Speaker*: Motion moved.

*Sri S. V.* K. *Prasad:* I beg to move:

To reduce the allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss (1) wastage and management of Road Transport Department in Andhra Pradesh (2) Not nationalising Road Transport in Andhra Region.

*Mr. Speaker:* Motion moved.

*Sri K. V. S. Padmanabharaju (Revadi)*: I beg to move:

To reduce allotment of Rs. 1,85,37,500 for
R, T. D. by Rs. 100

(To discuss Government's failure to construct a road linking up Gurla-Kalavacharla, Kotagandredu and Garikavalasa villages in Vizayanagaram taluq of Vizag District.)

*Mr. Speaker*: Motion moved.

*Sri K. V. S. Padmanabharaju :* I beg to move:

To reduce the allotment of Rs. 1,85,37,500 for
R. T. D. by Rs. 100

(To discuss Government's failure to construct a road from Lakkavarapukota to Alamanda in Srungavarapukota taluk, Vizag District via. Kotyada village.)

*Mr. Speaker :* Motion moved.

*DEMAND No. X L — Capital Outlay on Industrial Development - Rs.* 2,09,08,800.

*Sri B. P. Sesha Reddi:* I beg to move:

To reduce the allotment of Rs. 2,09,08,800 for
Capital Outlay on Industrial Development by Rs. 100

(To impress upon the State Government to encourage certain industries where there is a possibility by giving to public sector a guarantee of certain percentage of Dividend and also providing adequate checking of the working.)

*Mr. Speaker*: Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya:* I beg to move:

To reduce the allotment of Rs. 2,09,08,800 for
Capital Outlay on Industrial Development by Rs. 100

(To impress upon the Govornment to start a Cement Factory at Viziapuri in Public Sector with the permission of the Government of India.)

*Mr. Speaker:* Motion moved.

*DEMAND No. XLIV — Other State Works Rs.* 69,08,000

*Sri Vavilala Gopala Krishnayya:* I beg to move:

To reduce the allotment of Rs. 69,08,000 for
other State Works by Rs. 100

To impress upon the Government to undertake the manufacture of at least 500 Telugu Typewriters in this year.

*Mr. Speaker* : Motion moved.

*DEMAND No. XLV — R. T. D. — Rs.* 40,60,500

*Sri S. V. K. Prasad :* I beg to move :

To reduce the allotment of Rs. 40,60,500 for R. T. D. by Rs. 100

(To discuss the need for enough buses for transport of passengers in Telengana area and necessary facilities for the passengers.)

*Mr. Speaker* : Motion moved.

* శ్రీ బి. రత్నసభాపతి : అధ్యక్షా ! నిన్న ముఖ్యమంత్రి అన్ని పరిశ్రమల గురించి వివరములతో కూడిన ఒక నోటు యిచ్చారు. ఇంకా సందేహాలుంటే తీర్చుటకు యీరోజున గంభీరోపన్యాసముచేస్తూ చాలావరకు చెప్పారు. కాని రాష్ట్రంలో మొత్తం పరిశ్రమలగురించి ఇదమిద్ధమైన ప్రభుత్వపాలసీ ఏమిటో స్పష్టంగా సభ్యులకు తెలియపరచలేదు. మొత్తం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ పరిశ్రమలపైన రు. 8,38,00,000 లు పెట్టుబడి పెట్టారు. ఇంత మొత్తం నాకు తెలిసినంతవరకు భారతదేశంలో ఏ రాష్ట్రప్రభుత్వం పరిశ్రమలలో పెట్టుబడి పెట్టలేదు. ఇందులో, యిది వరకు హైదరాబాదు ప్రభుత్వం ఎక్కువ భాగం పెట్టింది,—ప్రభుత్వషేర్ల రూపంలోగాని, అప్పులమూలంగాగాని 8 కోట్ల 22 లక్షలు పెట్టింది, పోతే, పూర్వపు ఆంధ్రరాష్ట్రప్రభుత్వం 15 లక్షలకు పైబడి పెట్టుబడి పెట్టినట్లు మా కిచ్చిన రిపోర్టులో వున్నది. ఈ మొత్తమున కంతకు 4½% బ్యాంకురేటు ప్రకారం వడ్డీ లెక్కవేస్తే, సంవత్సరమునకు 55 లక్షల వడ్డీ రావాలి.

శ్రీ యన్. సంజీవరెడ్డి : ఈ పరిశ్రమలలో కొన్ని నష్టము వచ్చినవి వున్నాయి. Average న లెక్కవేస్తే 3.5 return వచ్చింది.

శ్రీ బి. రత్నసభాపతి : అప్పులపైన వడ్డీ, లాభాలు, అన్నీచేరి 3.5 కోట్లు అని మంత్రిగారు చెబుతున్నారు. షేర్సమీద డివిడెండ్సు మేనేజింగ్ ఏజన్సీ కమిషన్, మిగతా లాభాలు లెక్కవేస్తే 55 లక్షలకంటె ఎక్కువ రావడానికి అవకాశం వున్నది. నేను లెక్కవేసినది పెట్టుబడిపైన వడ్డీ 55 లక్షలు రావాలని చెప్పాను. ఇదివరకు ప్రభుత్వంగాని, యీ ప్రభుత్వంగాని, ఒక నిర్ణీతమైన పాలసీ ఏర్పరచుకొని, పరిశ్రమలను సక్రమంగా నడుపుటకు ప్రయత్నం చేసియుంటే 3.5 కోట్లు మాత్రమే కాదు, అయిదారు కోట్లకు పైబడి రావలసిన అవకాశం వున్నది. దానికి ఏవిధంగా వస్తుందని ప్రశ్న అడిగితే, ఇతర రాష్ట్రా

లలో ప్రభుత్వ యాజమాన్యమున జరిగేటటువంటి పరిశ్రమలలోగాని, లేక ప్రయివేటు రంగములో జరిగే పరిశ్రమలలోగాని వచ్చేటటువంటి లాభాలు చూస్తే ఖచ్చితంగా అర్థం అవుతుంది. అవి నేను డిటైల్సుకు పోయినపుడు చెబుతాను. మనకు మూడున్నరకోట్ల రూపాయలుమాత్రమే వస్తోంది. మిగతాదంతా ఏవిధంగా పోతోందన్నది తెలుసుకోటానికి, ప్రతి పరిశ్రమలోనువున్న లోపాలను తెలుసుకొనడానికి ఒకనిర్ణిబద్ధమైన ఎంక్వయిరీ జరిపి, అవి సభ్యులకు ప్రజలకు చెప్పేటటువంటి వ్యవహారము ఇంతవరకు జరగలేదు. ప్రభుత్వానికి నూటికి ఏభయికంటె ఎక్కువ షేర్సు వున్నటువంటి కంపెనీలు ఆంధ్రప్రదేశ్‌లో ఏడు వున్నవి. ఈ ఏడు కంపెనీలలో కనీసం నాలుగు కంపెనీలు లాస్‌గా నడుస్తున్నాయి. బోధన్ షుగర్ ఫ్యాక్టరీ, సింగరేణి కాలరీస్, యీ రెండింటిలో మాత్రం లాభాలు కనబడుతున్నాయి. మిగతా కంపెనీలన్నీ పెద్ద నష్టముతో రన్ అవుతున్నట్లు ఇప్పుడు చూపుతున్న లెఖ్కలవల్ల తెలుస్తున్నది. ఇదివరకు ప్రభుత్వం యీ నష్టం రాకుండా చేయటానికి ఏమీచేయలేకపోయింది. ఇప్పటికయినా యీ ప్రభుత్వము ఒక విధమైన నిశ్చయానికి వచ్చి సీరియస్‌గా ఆలోచనచేసి, గట్టి ప్రయత్నాలు చేసి లాభాలు తీసుకురావడానికి ఏవిధంగా పనిచేస్తున్నారో తెలియదు. కంపెనీ లా ప్రకారం 617 సెక్షన్‌క్రింద, ప్రభుత్వ యాజమాన్యంక్రింద వున్నటువంటి పరిశ్రమలు గవర్నమెంటు కంపెనీలు అవుతాయి గనుక, వీటిలో లాభాలు తీసేదానికి ప్రయత్నించకపోతే, ప్రజలకు యీ పబ్లిక్ సెక్టార్ అనేదాంట్లో సంపూర్ణమైన విశ్వాసం పోతుందని ప్రభుత్వం గమనించిందా అని నేను అడుగుతున్నాను. ఈ పబ్లిక్ సెక్టార్‌లోగాని, ప్రభుత్వ కంపెనీలు మనం సృష్టించేదానికిగాని, లేదా భవిష్యత్‌లో మనం పరిశ్రమలు అభివృద్ధి చేసేదానికిగాని, ప్రజలలో విశ్వాసం పోతుందని తెలియజేస్తున్నాను. ఈ విషయాన్ని ప్రభుత్వం గుర్తించవలసిన అవసరం చాలావున్నది. ప్రత్యేకించి మనం యీ రోజున డెఫిషిట్ బడ్జెటుతో ప్రభుత్వ తతంగాన్ని నడుపుతున్నాము ఈ డెఫిషిట్‌ను పూర్తిచేసుకోవటం ఎలా అని ఆలోచిస్తున్నాము. ఇవాళ ప్రభుత్వం కేవలం టాక్సులు వేసి డెఫిషిట్ - పూర్తిచేసుకోటానికి ప్రయత్నం చేస్తున్నారు. ఏ ప్రభుత్వంకూడ, ఇప్పుడు మనం వున్న పరిస్థితులలో ఉన్నప్పుడు ఒక్క టాక్సెస్ వేయటం ద్వారానే డెఫిషిట్ పూర్తిచేసుకోటానికి ప్రయత్నించదు. డెఫిషిట్ పూర్తిచేసుకోవటానికి పన్నులు వేయటం మార్గం కాదు. పబ్లిక్ ఎంటర్‌ప్రైజ్‌లో, ఎక్కువగా పరిశ్రమలు పెట్టి, ప్రభుత్వం షేర్సు ఎక్కువ తీసికొని, ఆ పరిశ్రమలో ఎక్కువ లాభాలు సంపాదించి, ఆ విధంగా డెఫిషిట్ పూర్తిచేసుకొనేవిధానాన్ని మన ప్రభుత్వం అనుసరించవలసిఉంటుంది. ప్రభుత్వం ప్రజల డబ్బుతో ఎక్కువషేర్సు తీసుకొని, ప్రభుత్వ యాజమాన్యమున నడుపుతూన్న ఇటువంటి పరిశ్రమలలో ఎక్కువ లాభాలు సంపాదించి యీ లోటు బడ్జెటును పూర్తిచేసుకోవటం లేదు. ఆ విధంగా పబ్లిక్ సెక్టార్‌లో

ప్రజలకు విశ్వాసాన్ని పెంపొందించే ప్రయత్నం ప్రభుత్వం చేయడం లేదు. ఇది వరకు ప్రభుత్వం యీవిధంగా చేయకపోగా, యీ ప్రభుత్వం అయినా ఆ విధముగా లాభాలు తీసుకువచ్చే ప్రయత్నం చేస్తుందనే ఆశ కనిపించటంలేదు.

మనకు కొన్ని ఇండస్ట్రీస్ ఉన్నాయి. అందులో ప్రాగాటూల్స్ కంపినీ ఒకటి. ఈ ప్రాగాటూల్స్ కంపినీ ఆసియాఖండంలోగల కంపెనీలన్నా పెద్ద కంపినీ అని అనుకొంటున్నారు. పెద్దపెద్ద ఎక్స్పర్ట్సకూడ, ఎయిర్ క్రాఫ్ట్స తయారుచేయటానికి కావలసిన మెషనరీ, కొన్ని పార్ట్స తయారుచేయటానికి కావలసిన మెషినరీ ఇక్కడ ఉన్నదని చెబుతున్నారు. ఇది చాలా పెద్ద ఫ్యాక్టరీ అని, దీనిని చాలా గొప్పగా తయారుచేశారని చెబుతున్నారు. కాని, ఇన్నాళ్ళనుండి యీ కంపెనీలో జరిగిన తతంగము, మేనేజిమెంటు చూస్తే, 1955 వ సంవత్సరములో ఒక లక్షా 80 వేల రూపాయల చిల్లర నష్టము వచ్చింది. ఈ మేనేజిమెంట్‌ను సక్రమంగా నడిపి, నష్టాన్ని పోగొట్టి, లాభాలు చేకూర్చటానికి ఇంతవరకు ప్రభుత్వం ప్రయత్నంచేయలేదు. ఇదివరకు ప్రభుత్వం కూడ ప్రయత్నం చేయలేదు. పోతే, 'యీ కంపెనీని నడపటానికి మాకు శక్తి సామర్థ్యాలు లేవు, మేము ఇన్‌కాంపిటెంట్' అని రుజువు చేసుకొంటున్నాము. ఈ నష్టాన్ని పూడ్చుకొని, మరొకవిధంగా దీనిని అభివృద్ధి చేయడానికి కేంద్ర ప్రభుత్వంనుండి డబ్బుతీసుకొని మేనేజిమెంటంతా వారిచేతికిస్తామంటున్నారు. కేంద్రప్రభుత్వమైనా ప్రభుత్వ యాజమాన్యాన్నే జరగాలిగదా. లేదా మేనేజింగ్ ఏజన్సీ, అక్కడున్న రిప్రజెంటిటివ్స్‌కో, ఇంకొకరికో ఇచ్చి, మరొకరకంగా ఇంకొకరి లాభంకొరకు కేంద్రప్రభుత్వం చేయాల్సిందే. రాష్ట్ర ప్రభుత్వం ఏ విధంగా చేస్తుందో, అదేవిధంగా కేంద్రప్రభుత్వంకూడ చేయగలుగుతుంది కాని, ప్రత్యేకంగా వాళ్లు స్వంతంగా వచ్చిగాని, లేదా కేంద్రమంత్రో, ప్రధాన మంత్రో వచ్చి కూర్చుని గాని, యీ పరిశ్రమను నడిపేమార్గం లేదు. ఈ పరిశ్రమకోసం కేంద్రప్రభుత్వంనుండి సహాయం మన ప్రభుత్వం తీసుకొంటున్నది. ఈవిధంగా తీసుకొన్నంతమాత్రాన, దానిపైన యాజమాన్యం, మేనేజిమెంటు వారికివ్వాల్సిన అవసరం ఏమి ఉన్నదని అడుగుతున్నాను. కేంద్రప్రభుత్వము యీరోజున పరిశ్రమలకు ఆర్థికసహాయము చేస్తున్నది. అందుకు వారు కొన్ని షరతులు ఏవీ అడగటము లేదు. ఈ ప్రభుత్వము కేంద్రమునుంచి ఆర్థిక సహాయము తీసుకొంటూ, మేనేజిమెంటు తనచేతిలో ఉంచుకొని, సక్రమంగా మేనేజ్ చేశారంటే ఎక్కువ లాభాలు వచ్చేదానికి అవకాశాలున్నాయి. అంతే కాకుండా, ఇక్కడ అనేకమైన పార్ట్స తయారుచేసి, ఇక్కడనుండి దేశం అంతటకు ఎగుమతి చేయగల ఒక సుప్రసిద్ధమైన పరిస్థితి ఏర్పడే అవకాశాలున్నాయి. అందుకు ప్రభుత్వము ఎందుకు ప్రయత్నం చేయకూడదో నాకు అర్థంకావడం లేదు. ఈ మేనేజిమెంటు కేంద్రప్రభుత్వానికి ఇచ్చినంతమాత్రాన అక్కడ

ఉన్న లోపాలు తొలగిపోతాయని నాకు నమ్మకం లేదు. ఇక్కడ ప్రభుత్వ యాజమాన్యంలో ఏమేమి లోటుపాట్లు జరిగాయో, కేంద్రప్రభుత్వ యాజమాన్యంలోకూడ అవే లోటుపాట్లు జరుగుతాయి. మేనేజిమెంటు కేంద్ర ప్రభుత్వం తీసుకొన్నంతమాత్రాన లాభం వస్తుందని నమ్మటానికి వీలులేదు. కాబట్టి యీ ప్రభుత్వమే తీసుకొని నిర్వహిస్తే ఎక్కువలాభాలు రావటానికి అవకాశాలున్నాయి. ఎక్కువ అభివృద్ధిచేయటానికి అవకాశాలున్నాయి. గాబట్టి యీ ప్రభుత్వమే నిర్వహించటానికి పూనుకోవాలని కోరుతున్నాను.

**శ్రీ ఎన్. సంజీవరెడ్డి :** మనకు డబ్బు ఎట్లా అని అడుగుతున్నాను.

**శ్రీ బి. రత్నసభాపతి :** మేనేజిమెంటు ఇస్తేనే కేంద్రప్రభుత్వం ఆర్థిక సహాయం చేస్తుందా, లేకపోతే చేయదా, అని అడుగుతున్నాను. కేంద్ర ప్రభుత్వంచేతికి దానిపైన మేనేజిమెంట్ ఇస్తేనేనా, వారు ఆర్థికసహాయం చేసేది? అని అడుగుతున్నాను.

**శ్రీ ఎన్. సంజీవరెడ్డి :** ఊరికే ప్రతి కన్‌సర్న్‌కు ఇచ్చుకొంటూ పోతూ వుంటారా ఏమిటి ?

**శ్రీ బి. రత్నసభాపతి :** It is not a charitable institution. నిర్వహించే శక్తిలేదని, యీ ప్రభుత్వంయొక్క ఇన్‌కాంపిటెన్స్‌ను కన్‌ఫెస్ చేసుకొంటున్నారు. కేంద్రప్రభుత్వానికి పోయినంతమాత్రాన కాంపిటెన్సీ ఎట్లా పెరుగుతుందని ముఖ్యమంత్రిని అడుగుతున్నాను. దీనిని యీ ప్రభుత్వ మంత్రులుగాని ఆ ప్రభుత్వ మంత్రులుగాని నడపటంలేదు. అక్కడ ఉన్న ఆఫీసర్సే నడుపుతున్నారు. అంతమాత్రంచేత వచ్చినతేడా ఏమిటని ముఖ్యమంత్రిగారిని అడుగుతున్నాను. సెంట్రల్ గవర్న మెంటు ఏ పరిస్థితులలో అయినా ఆర్థిక సహాయం చేయవచ్చు. కేవలం మేనేజిమెంట్ మారినంత మాత్రమున, దాని ఎఫిషియన్సీ, కాంపిటెన్సీ, ఎలా మారుతుందని అడుగుతున్నాను.

**శ్రీ ఎన్. సంజీవరెడ్డి :** గౌరవసభ్యులైనా వారి రూపాయలు ఇచ్చేటప్పుడు, వారి రూపాయలు భద్రంగా ఉన్నాయా లేవా అన్నది చూసుకొనే ఇస్తారు.

When one lends money to others, one will take care of one's property.

అదేవిధంగా కేంద్రప్రభుత్వంవారు ఇక్కడ కోట్ల రూపాయలు సింక్ చేస్తున్నప్పుడు, ఇది సక్రమంగా నడిచేటట్లు చూడవలసి ఉన్నది. వారికి పూల్ ఆఫ్ ఆఫీసర్సు ఉన్నారు.

They have been managing a number of industries in India.

ఇది ఒకచేకాదు. దీనికన్నా పది వంతులు పెద్దవి మేనేజ్ చేస్తున్నారు. అక్కడి పూల్ ఆఫ్ ఆఫీసర్సునుంచి అప్పుడే ఒకరిని పంపారు. కేంద్రప్రభుత్వం తరపున వారు వచ్చి చార్జ్ తీసుకొన్నారు. వాళ్ళకున్న పూల్ ఆఫ్ ఆఫీసర్సు మనకు లేరు. 'రత్నసభాపతి ఏదో ఇంత స్పీచ్ ఇచ్చాడే, అతడు లాభాలు సంపాదించి పెట్టవచ్చు' అని వారిని నేను ఎపాయింట్ చేయవచ్చు. కాని యీ నాలుగునెలలో ఇప్పుడు పోయేదానికన్నా నాలుగురెట్లు ఎక్కువ పోతుంది.

శ్రీ బి. రత్నసభాపతి : కేంద్రప్రభుత్వంలో 'పూల్ ఆఫ్ ఆఫీసర్సు' ఉన్నది, లేదని నేననటము లేదు. కేంద్రప్రభుత్వం ఆర్థికసహాయము చేయవచ్చును! కేంద్రప్రభుత్వానికి రాష్ట్రప్రభుత్వంమీద అంతమాత్రం విశ్వాసం లేదా అని అడుగుతున్నాను, రాష్ట్రప్రభుత్వం మీద వారికివిశ్వాసం ఉండాలి. వారు పెట్టుబడి పెట్టినప్పుడు, ఇక్కడ కొంతమంది డైరక్టర్సును పెట్టవచ్చును. కాని మేనేజిమెంటును వారికి ఎందుకివ్వాలని అడుగుతున్నాను. ఏప్రభుత్వానికైనా యీపరిశ్రమలో ఆదాయం ఆపరిశ్రమను నడిపే మేనేజింగ్ కమిటీని బట్టి వస్తుంది. పరిశ్రమ సక్రమంగానడుస్తోందా లేదా అన్నది ఆ కమిటీమీద ఆధారపడి ఉంటుంది. ఆపరిశ్రమలో వచ్చే కమీషన్ కేంద్ర ప్రభుత్వానికే పోతుంది. ఈ రాష్ట్ర ప్రభుత్వం ఇంత డబ్బు నష్టము పెట్టుకొన్న తర్వాతకూడ, ఆ కమీషన్ కేంద్రప్రభుత్వానికి ఎందుకు పోవాలని అడుగుతున్నాను. డబ్బు విషయములో కేంద్రానికి రాష్ట్రప్రభుత్వంమీద సంపూర్ణమైన విశ్వాసం లేకపోతే, రాష్ట్ర ప్రభుత్వం సక్రమంగానడపలేరు అనుకొన్నట్లయితే, వారు డైరక్టర్సును పెట్టవచ్చును. ఆ డైరక్టర్స డబ్బు సక్రమంగా ఖర్చగునట్లు చూడవచ్చును. కాబట్టి, యీ పరిశ్రమను కేంద్ర ప్రభుత్వానికి ఇవ్వటం చాలా విచారకరమైన విషయమని చెబుతూ, దీని విషయంలో ప్రభుత్వం తిరిగి ఆలోచిస్తారని ఆశిస్తున్నాను.

ఇక నిజాం Sugar Factory గురించి ముఖ్యమంత్రిగారు చాలావిషయాలు చెప్పారు. చాలమంది "ఇక్కడ41 లక్షలరూపాయలు మాత్రమే లాభంవస్తున్నది. ఇంకాఎక్కువ రావడానికి వీలున్నది, రావచ్చుకదా, ఎందుకు రావడంలేదని" ప్రశ్నిస్తున్నారు.దానిని గురించి రాబోయేఅన్నిరకాల ప్రశ్నలను ఊహించి సమాధానాలుకూడా చెప్పారు. కానికేవలం ఊహించినప్రశ్నేనా యిది ? అని అడుగుతున్నాను. ఈ రోజునవచ్చే40 లక్షల రూపాయల లాభం చాలా తక్కువ, 80 లక్షల రూపాయలో, కోటి రూపాయలో లాభం రావలసినదని ఊహిస్తున్నారన్నారు. అది సరికాదు. ఇదేరకమైన Sugar Factories బొంబాయిలో వున్నాయి. మన ఆంధ్రలో వున్నాయి. వాటినీ వీటినీ సరిపోల్చి చూడండి. బొంబాయిలో బెల్లాపూర్ లో ఒక Sugar industry వుంది. ఆ పరిశ్రమ యొక్క పెట్టుబడి 46 లక్షల రూపాయలు. 1954 వ సంవత్సరంలో ఆ పరిశ్రమకు

వచ్చినటువంటి లాభం 30 లక్షల రూపాయలు. తరువాత ఉయ్యూరులో చక్కెర ఫ్యాక్టరీ వుంది. దానికి 16 లక్షల రూపాయలు పెట్టుబడి పెట్టారు. 1954 వ సంవత్సరంలో net profits 13 లక్షల 61 వేల రూపాయలు. తరువాత బోధన్ Sugar Factory ని చూడండి. ఒక కోటి నలభై అయిదు లక్షల రూపాయలు పెట్టుబడి పెట్టారు. 1954 వ సంవత్సరంలో సుమారు 40 లక్షల రూపాయల లాభం వచ్చింది. దీనికి కారణాలు ఏమిటని ఆలోచన చేయవలసి వుంది. దీనికి ఒక పెద్ద చరిత్ర వున్నది. ఆ చరిత్ర యిక్కడ చెప్పడానికి పూనుకోడం లేదు. అది అందరికీ తెలిసిన విషయమే. తరువాత ఆ ప్రాంతానికి సంబంధించిన సభ్యులు దానిగురించి విపులంగా చెబుతారుకూడా. కాని ఒక కోటి నలభై అయిదు లక్షల రూపాయలు పెట్టుబడి పెట్టి, 40 లక్షల రూపాయలు మాత్రమే లాభం పొందు తున్నారు. బెల్లాపూర్ Sugar Factory 46లక్షల రూపాయలు పెట్టుబడిపెట్టి 30లక్షల రూపాయలు లాభం సంపాదిస్తున్నది. ఉయ్యూరు sugar factory 16 లక్షలరూపాయలు పెట్టుబడిపెట్టి 13 లక్షల 61 వేల రూపాయలు లాభం పొందుతున్నది. దీంట్లో పెద్ద విషయాలేమీలేవు. Top heavy administration గురించికాక చిల్లరగాజరిగిన వ్యవహారాల గురించి ఆలోచనచేస్తాం అని చాలా చులకనగా చెప్పడం చాలా విచారకంగా వుంది. దీనినిగురించి చాలా దీర్ఘమైన విచారణ జరుపవలసిన అవసరం వుంది. తరువాత Managing Agents గురించి చెప్పారు. వారికి ఏదో ఒక నిర్ణీతమైన timeఉందనీ ఆ time లోపల మేము వారిని terminate చేయడానికి పూనుకోవడంలేదనీ చెప్పారు. ఇక్కడ Managing Agents రెండు రకాలు. ఒకటి : Managing రెండు : Agency, దాని ఉపసంఘంవారు Representatives. ఈ Representatives అనేవాళ్ళు Hyderabad Construction Company కి ఇచ్చారు. వాళ్ళకు యీ Managing Agents కి సంబంధంవుంది Managing Agents కు వచ్చే 10% కమిషనులో 8 భాగాలు Representatives కి పోతాయి. రెండుభాగాలు మాత్రమే ఆ మేనేజింగు ఏజెన్సీకి వస్తుంది. ఈ note ను బట్టిచూస్తే పరిశ్రమల మేనేజింగు ఏజెన్సీని పరిశ్రమల డిపార్టుమెంటు చేతులలో పెట్టుకున్నారు. అదేవిధంగా బోధన్ Sugar factory లో కూడా యీ మేనేజింగు ఏజెన్సీని వారి చేతులలో పెట్టుకోకుండా యింకొకరి చేతులలోకి ఎందుకు ఇవ్వవలసిన అవసరం వచ్చిందో అర్థంకావడంలేదు. దీంట్లో ముఖ్యమైన విషయం ఈ managing agencies కి Representatives కి వచ్చే కమీషను నిష్పత్తి, 1954 వ సంవత్సరంలో 3 లక్షల రూపాయల చిల్లర Managing agency కి కమిషను వచ్చింది. ఈ సొమ్ములో ఈ హైదరాబాదు కన్‌స్ట్రక్షన్ కంపెనివాళ్ళు రిప్రజెంటేటివ్సుగా వున్నారు. కనుక వాళ్ళకు దాదాపు 8భాగాలు పోతాయి. పోతే ప్రభుత్వానికి మిగిలేది 2 భాగాలుమాత్రమే. ఈరిప్రజెంటేటివ్సును మళ్ళా మేనేజింగు ఏజెంట్సుగా ఎందుకు పెట్టుకోవలసివచ్చిందని అడుగుతున్నాను.

వీళ్ళకు ప్రతిసంవత్సరం 4, 5 లక్షల రూపాయలు ఎందుకివ్వవలసివచ్చిందని అడుగుతున్నాను. అది ముఖ్యమంత్రిగారు స్పష్టంగా చెప్పలేకపోయారు. ఏమి ఆలోచన చేస్తున్నారో తెలియదు. ఇంతవరకు జరిగిన తతంగం అంతా యిది. 80 లక్షల రూపాయలో కోటి రూపాయలో, బోధన్ Sugar factory కిలాభం రావలసి 40, 32 లక్షల రూపాయలు మాత్రమే చూపించారు. ప్రతిసంవత్సరం యీ మిగతా 50 లక్షలు, 40 లక్షలు ఏమవుతుందో ప్రపంచానికి తెలియదు. దీనికి బాధ్యులయిన ప్రజలకసలే తెలియదు. దీనిపై విచారణ జరిపించాలి. మూడు సంవత్సరాల తరువాత మాత్రమే చూస్తామంటున్నారు. ఈ మూడు సంవత్సరాలు యిట్లా ప్రతిసంవత్సరం 50 లక్షల రూపాయిలు ప్రభుత్వం వాళ్ళకు అప్పజెప్పవలసినదేనా అని అడుగుతున్నాను. ఇవన్నీ పాత ప్రభుత్వంపైన బాధ్యత వేస్తున్నారు. గత ప్రభుత్వంలో జరిగింది మాకు తెలియదు అనవచ్చు. కాని ఈ ప్రభుత్వం చేసిన పనికూడా ఒకటి వుంది. దానికి ముఖ్యమంత్రిగారిని సమాధానం చెప్పమని కోరుతున్నాను. శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారి హయాంలో Bodhan Sugar Factory లో 2½ లక్షల రూపాయలు అదృశ్యం అయిపోయాయి. రామగోపాలరెడ్డి అనే వ్యక్తిపైన prosecution launch చేశారు. అది కొంతవరకు జరుగుతూ వచ్చింది. కాని ఈ ప్రభుత్వం వచ్చిన తరువాత గతంలో యేమిజరిగినదీ మాకు తెలియదు, మేము శుభ్ర పరుస్తాం అని చెబుతున్నారు. అటువంటి ఈ ప్రభుత్వం ఆ prosecution ను ఎందుకు withdraw చేసినదని అడుగుతున్నాను. అతడు రెండున్నరలక్షల రూపాయలు తినలేదనా ప్రభుత్వం యొక్క అభిప్రాయం ? ఆ prosecution ను withdraw చేయడానికి ప్రత్యేకమైన కారణాలు యేమున్నాయని ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాను. ఇవన్నీ ప్రజలు తెలుసుకోవలసిన అవసరం వుంది. దానికి ముఖ్యమంత్రిగారు ప్రత్యేకించి సమాధానం యిచ్చేటప్పుడు అంతా చెప్పమని కోరుతున్నాను. తరువాత ఆల్విన్ మెటల్ వర్క్స్ గురించి ఆస్బెస్టాస్ గురించి మిగతా పరిశ్రమల గురించి చెప్పారు. ప్రతిదాంట్లోకూడా నష్టం వస్తుందన్నారు. వీటిలో ఎక్కువ వాటాలు ప్రభుత్వానికున్నాయి కనుక, యివి సక్రమంగా జరుగుతున్నవో లేదో పరిశీలించాల్సిన అవసరం, బాధ్యత ప్రభుత్వానికున్నది. ఈ పరిశ్రమలన్నిటిలో ఒక విచిత్రమైన వ్యవహారం జరుగుతున్నది. ప్రభుత్వం పరిశ్రమలను నడిపేటప్పుడు managing agency మరొకరికి యివ్వడం జరుగుతున్నది. ఈ managing agency వాళ్ళు హైదరాబాదుకు సంబంధించి నంత వరకు హైదరాబాదు కన్స్ట్రక్షన్ కంపెనీ, అల్లాడిన్ కంపెనీ. యీ రెండు గ్రూపులకు మాత్రమే యివ్వడం జరుగుతున్నది. ఈ note అంతా చూస్తే ఈ రెండు కంపెనీలు మినహాయిస్తే ఏ కంపెనీగాని, ఏ వ్యక్తిగాని కని పించడం లేదు. పోతే ఒకటి రెండు పరిశ్రమలను ప్రభుత్వం నడుపుతున్నది. ఈ రెండు కంపెనీలు కూడా కొన్ని పరిస్థితులలో వాళ్ళకు లాభకరంగా

కనిపించకపోయినప్పుడు అది మరొకరికి Representatives గానో లేక Constituted power of attorney అని Birla Bhrothers కి యివ్వడం జరిగింది. ఈ managing Agents కు లాభకరంగా లేనప్పుడు మళ్లీ constituted power of attorney కి యివ్వవలసిన అవసరం యేముంది? వాళ్లు తీసుకోవడంలో రహస్యం యేముంది? మధ్యవర్తులు ఎవరో కొంతమంది ఆ వచ్చే కమిషనులో భాగం పంచుకొని మిగతావాళ్ళకు యివ్వడం జరుగుతున్నది. కాని 1956వ సంవత్సరంలో ప్యాసయిన Company Law ప్రకారం ప్రభుత్వం అనుమతి లేనిదే managing agencies ను transfer చేయడానికి ఎవరికీ అవకాశం లేదు. దానిని circument చేయడానికి bogus institution ను సృష్టించారు. Constituted power of attorney అనే యీ institution ద్వారా Company Law లో వున్న provisions ను circumvent చేశారు. వీటిద్వారా వచ్చిన కమిషనును పంచుకొని ప్రజలను, ప్రభుత్వాన్ని మోసము చేయడానికి ప్రయత్నం చేస్తున్నట్లు స్పష్టముగా కన్పిస్తున్నది. ఈ constituted power of attorney అనే institutions ను ఈ managing agencies ను మిగతా కంపెనీలన్నిట్లో కూడా సంపూర్ణంగా terminate చేసి కేవలం ప్రభుత్వ డిపార్టుమెంటుకు యివ్వడం మంచిదని, సలహా కోరారు కనుక చెబుతున్నాను.

రవాణాగురించి ముఖ్యమంత్రి లెక్కలుచెప్పారు. మద్రాసులో వస్తున్న లాభాలకు హైదరాబాదులో వచ్చేలాభాలకు తేడాలు ఎందువల్లనో, ఇక్కడ తక్కువలాభాలు ఎందుకువస్తున్నవో, అక్కడ ఎక్కువలాభాలు ఎందుకు వస్తున్నవో, చెప్పారు. దీనినిగురించి ఎక్కువగా తెలిసిన మిత్రులు మాట్లాడుతారు. ఆంధ్రప్రాంతంలో రవాణాకు సంబంధించినంతవరకు బస్సురూట్లు విషయమై ఏమిజరుగుతున్నది మనకు తెలుసును. బడ్జెటుసమావేశాలలో ప్రశ్నోత్తరాల సమయంలో సక్రమమైన సలహాలు సభ్యులు యిచ్చారు. ఈ బస్సురూట్లను ప్రభుత్వయాజమాన్యంక్రింద తీసుకోవడం చాలా అవసరం. ఈప్రశ్నవచ్చినపుడు ప్రభుత్వానికి డబ్బుకొరత అనే జవాబువస్తుంది. డబ్బుకొరత పరిష్కారమైతే తరువాతచూస్తాము అంటారు. ఇపుడు ఎన్నిరకాలుగా బస్సురూట్లు పంపకం అవుతున్నాయో, దీనివల్ల ఎంతమంది లాభాలు సంపాదిస్తున్నారో, ఈ తతంగా అన్నీ public talk. ఎవరినిఅడిగినా చెబుతారు. బస్సుడ్రైవరు, కండక్టరునుంచి ప్యాసింజరువరకు ఎవరినిఅడిగినా చెబుతారు. కొన్నివేల రూపాయలు ఒక్కొక్కరూటు సంపాదించడానికి వ్యక్తులు ఖర్చుచేయడం, దీనిపైలాభాలు పొందడం మనం చూస్తున్నాము. డబ్బులేదని ఒకసమాధానంచెప్పి ప్రభుత్వ పక్షానికి సంబంధించినవారికి, వారిస్నేహితులకు బంధువులకు ఈ అవకాశాన్ని కలిగించడంతప్ప మరొకటికనిపించడంలేదు. ఇది చాలాతీవ్రమైనసమస్య. లక్షల కొలది రూపాయలను ప్రజలు ఈబస్సు ప్రయాణాలపై ఖర్చుచేస్తున్నారు,

రవాణా జాతీయం చేయడానికి ఒక కార్పొరేషన్ పర్పాటు చేయడానికి ప్రభుత్వానికి డబ్బులేకపోవచ్చును. నేరుగా యాజమాన్యం వహించడానికి డబ్బు లేకపోవచ్చును. ఇప్పుడు జరుగుతున్న తతంగాన్ని ఆపుచేసి నైతికపతనాన్ని నివారించడానికి ఒకసహకారపద్ధతిలోనైనా ప్రయత్నంచేస్తారా అని ప్రభుత్వం వారిని అడుగుతున్నాను. ఇందులో ప్రభుత్వానికి కొన్నిఇబ్బందులున్నాయి. నాకు తెలుసును. మీకు కావలసిన అభిమానాలు చెడవచ్చును. మీరుసహాయం చేయవలసినవారు కొంతమందికి సహాయం చేయలేకపోవచ్చును. కాని రాష్ట్రానికి ప్రజలకు ఉపయోగపడేమార్గం ఇది. ఇతర దేశాలలో అమలులోఉన్న పద్ధతి ఇది. ఈ పద్ధతినిఅయినా చేస్తారా అని అడుగుతున్నాను.

*శ్రీ బి. సత్యనారాయణరావు (మధిర): అధ్యక్షా, ఈనాడు మనము చర్చించేది ముఖ్యమైన సమస్య. కార్మిక శ్రేయస్సు మీదనే దేశాభ్యుదయము కూడా ఆధారపడి ఉన్నది. వ్యవసాయకంగా ఆంధ్ర రాష్ట్రం చాలా ముందంజ వేసినది అని యావద్భారతంలో చెప్పుకుంటారు. పారిశ్రామికంగాకూడా మన రాష్ట్రం అదేవిధంగా అభివృద్ధి చెందవలె. అది చాలా అవసరం. హైద్రాబాదు రాష్ట్రంలో అప్పటి ప్రభుత్వం పరిశ్రమలమీద కొంత ద్రవ్యాన్ని వెచ్చించి కొంత అనుభవాన్ని గడించింది. ఆంధ్రరాష్ట్రంలోకూడా ఇదేవిధంగా కొన్ని పరిశ్రమలమీద డబ్బు వెచ్చించబడినది. మనకు కలిగిన ఈ అనుభవాలను యధార్థ దృష్టితో పరిశీలించి మన రాష్ట్ర అభివృద్ధికొరకు ఉపయోగపరచు కుందాము అని నేను మనవి చేస్తున్నాను. పెట్టుబడి దృష్ట్యా చూచినట్లయితే ఈనాడు మనకు ఆదాయంవచ్చే పరిశ్రమలలో తరుగుగా ఉన్నది. ముఖ్యమంత్రిగారు చెప్పినట్లు ఈనాడు జరిగే వ్యయం అధికంగానే ఉన్నది. నిజామాబాదు చక్కెరమిల్లు కానివ్వండి; క్రొత్తగూడెం బొగ్గుగనులు కానివ్వండి; ఎక్కడయినా ఖర్చు అధికంగానే కనిపిస్తోంది. క్రొత్తగూడెం బొగ్గుగనుల పరిశ్రమ విషయం పరిశీలిస్తే అక్కడ ప్రథమంలోనే **Industrial centres** లో కార్మిక క్షేత్రాలున్నచోట రాజకీయాల ప్రవేశం కొంతగలిగింది. క్రొత్తగూడెంలో నేను చూచినదానిని చెబుతున్నాను. ఆంధ్ర **labour** ఉండికూడా గోరక్‌పూర్ లేబరును పరిశ్రమ నిర్వహణకొరకు తీసుకు రావలసిన స్థితి ఈనాడు సంప్రాప్తమైనది. బహుశా రాజకీయ క్షేత్రాలుగా కార్మిక క్షేత్రాలు మారకుండా ఉంటే పరిశ్రమాభివృద్ధి తొందరగా జరుగడానికి సదుపాయాలు లభించేవి అని నేను భావిస్తున్నాను. కార్మిక సంక్షేమంకొరకు మనం కృషిచేయవలసినదే కాని, ఈ క్షేత్రాలలో మనం రాజకీయాలను ఎక్కువగా ప్రవేశపెడితే బహుశా మన పరిశ్రమలు దుర్వ్యయంతోనో ఎక్కువ వ్యయంతోనో నష్టపడడానికి అవకాశాలుంటాయి. నిజాం చక్కెరమిల్లు విషయం పరిశీలిస్తే 1952-53 లో 41 లక్షలు, 1953-54 లో 40 లక్షలైతే 1954-55 లో 32

లక్షలు మాత్రమే వచ్చినట్లు కనిపిస్తోంది. 1955-56 లో 42 లక్షలు వచ్చింది. ఒక సంవత్సరం 10 లక్షల రూపాయిల తరుగు మనకుకనిపిస్తోంది. ఇది విచిత్రంగానేఉన్నది. దీనిని పరిశీలించవలసినదే. అది గతకాలం నాటిదైనా ఈనాటిదైనా ప్రభుత్వ పరిశ్రమ సింగరేణి కాలరీస్ బొగ్గు చాలా ముఖ్యమైనది. అక్కడ మంచి quality బొగ్గు లభిస్తుందని అక్కడ కార్మికులు చెబుతారు. పాతబావులు ఇల్లందులో ఉంటవి. ఇప్పటికి మంచిబొగ్గు ఉన్నది. కొన్ని వందల సంవత్సరాల వరకు బొగ్గు ఉత్పత్తి కావడానికి అక్కడ సదుపాయాలున్నాయి. క్రొత్తగా త్రవ్విన బావులలో మంచి బొగ్గు లభిస్తున్నది. మానేజిమెంటుమాత్రం ఎక్కువగా ఖర్చుచేస్తున్నదా అంటే ఆకాశాన్ని అంటుతున్న భవనాలను చూస్తేనే మనకు అర్థం అవుతుంది. బహుశా ఇంగ్లండువంటి దేశాలలో కట్టే భవనాలు వంటి చక్కని భవనాలు కట్టుకుని వారు ఉంటున్నారు. మంచిదే. ఆనాడు పరిశ్రమ అభివృద్ధికి ప్రథమంగా ఈ సోపానం పెట్టుకున్నారు. కార్మికశ్రేయస్సు దృష్ట్యా పరిశ్రమ అభివృద్ధిదృష్ట్యా ఖర్చు తక్కువచేసుకోవడం ఉచితమని మన అనుభవంలో తేలుతున్నది. పరిశ్రమల విషయమై ఆలోచించేటప్పుడు మనకు ముందు కావలసినది డబ్బు. ఒకవైపు taxation సమస్య వచ్చినపుడు ఏమీ చేయడం లేదని చెబుతున్నాము. రెండవవైపు పరిశ్రమలు లేవు, కార్మికులకు తగిన పనిలేదు అని చెబుతున్నాము. కొంత joint responsibility తీసుకుంటే బాగుంటుంది అని నేను భావిస్తున్నాను. తప్పకుండా taxation చేయవలసినదే. ఈనాటి పరిస్థితులలో కార్మికులు నిరుద్యోగులుగా ఉండడానికి వీలులేదు. వారి శ్రేయస్సుదృష్ట్యా పరిశ్రమలు అభివృద్ధిచెందాలి. పరిశ్రమలు అభివృద్ధి చెందాలంటే డబ్బుకావాలి. కొన్నిచోట్ల మనకు నష్టంవస్తున్నది. పేరులను diminish చేసి ఏదోవిధంగా సర్దుకోడానికి ప్రయత్నంచేయాలన్నట్లు ముఖ్యమంత్రి చెప్పారు. నా అనుభవంలో పేర్లను తగ్గించడంకంటె ఎక్కువ పెట్టుబడినిపెట్టడమే మంచిది. లాభాలురానిచోట ఎక్కువ పెట్టుబడులను పెట్టి పరిశ్రమలన్నింటిని ప్రభుత్వ పక్షములో ఏర్పాటుచేయాలి. ఒక్కవిషయాన్ని నేను అంగీకరించలేను. దామోదర రెడ్డిగారు, విద్యాసాగర్ గారు అనుభవజ్ఞులే. వారి అనుభవాన్ని కాదనలేము. ఒక వ్యక్తిప్రభుత్వశాఖలలో సెక్రటరీగానో, డైరెక్టరుగానో నిర్వహణకొరకు నియమిస్తే ఆ పరిశ్రమను బాగుచేయ గలుగుతాడని నేనుఅనుకోను. ముఖ్యమైన పరిశ్రమలలో అటువంటివారిని కొంతమందిని పెట్టవచ్చును. ఉద్యోగస్థుల లోని నిపుణులు, అనుభవజ్ఞులయిన వారిని పరిశ్రమల గురించి తెలిసినవారిని, అనధికారులనుంచి అయినా తీసి పరిశ్రమలలో డైరెక్టర్లుగా పెట్టి నిర్వహణ చేయిస్తే పరిశ్రమలు అభివృద్ధి చెందుతాయి. ఏదో supervise చేస్తాము; లాభనష్టాల లెక్కలను వేస్తేనే చాలదు. భారతదేశంలోని మిగతా ప్రాంతాలలో ఏ రకంగా పరిశ్రమలు అభివృద్ధి చెందుతున్నాయో పరిశీలన చేయాలి. ఏ సదుపాయాలు కలిగించారో చూడాలి. అధికారులైనా అనధికారులైనా

వివక్షత లేకుండా యోగ్యులు, బుద్ధిమంతులు, integrity ఉన్నవారిని, పరిశ్రమల విషయాలను తెలిసినవారిని ప్రభుత్వం చేరదీసి వారి తెలివితేటలను వినియోగించుకుని పరిశ్రమలను అభివృద్ధి చేయడానికి ప్రయత్నం చేయవలెను. ఏ దశలోనయినా పరిశ్రమలను హైదరాబాదు ప్రభుత్వం ప్రారంభంచేసినది. ఈనాడు కొన్ని పరిశ్రమలలో లాభాలు వస్తున్నాయి. కొన్నింటిలో నష్టాలు వస్తున్నాయి. షేర్లను తగ్గించే బదులు పరిశ్రమలలో ఎక్కువడబ్బు పెట్టాలని నేను మనవిచేస్తున్నాను.

రోడ్డు ట్రాన్సుపోర్టు విషయం చాలా ముఖ్యమైనది. ఆనాడు హైదరాబాదు ప్రభుత్వం కొంత ప్రయత్నం చేసింది. రైల్వేలో అంతర్భాగంగా ఇది నడుస్తూ వుండేది. ఆనాడు పనిచేస్తున్నవారికి జీతాలు హెచ్చుగా వున్నాయి. ఆ హెచ్చుగావున్నవే ఈనాడు అమలులో వున్నాయి. వ్యవసాయ క్షేత్రంలో కాని, కుటీరపరిశ్రమలలో కాని, పెద్ద పరిశ్రమలలోగాని కో-ఆపరేటివ్ బేసిస్‌లో పనులు చేయాలని మనం వూహిస్తున్నాము. భావంమాత్రం చాలా పవిత్రమైనది. కలెక్టివ్ ఫార్మింగ్ చేసిన దేశాలు వున్నాయి. చిన్నచిన్న ఫార్మింగ్ చేసిన దేశాలు వున్నాయి. రష్యా గొప్పదేశం. అది కలెక్టివ్ ఫార్మింగ్ నుండి ఇండివిడ్యుయల్ ఫార్మింగ్‌కు దిగజారి వస్తున్నది.

శ్రీ పి. సుందరయ్య : కలెక్టివ్ ఫార్మింగ్ నుంచి ఇండివిడ్యుయల్ ఫార్మింగ్‌లోనికి వస్తున్నారని ఎవరు చెప్పారు ?

శ్రీ బి. సత్యనారాయణరావు : మొన్ననే ఎగ్రికల్చరల్ డిమాండుమీద మాట్లాడేటప్పుడు కొందరు వ్యక్తులు చెప్పారు. అయినా వారు ఎక్కువ 'అథారిటీ' గా చెప్పగల్గుతారు. వ్యక్తులమీదనే కోఆపరేటివ్ సిస్టమ్ ఆధారపడుతుంది. కోఆపరేటివ్ మూవ్‌మెంట్‌లోకి దేవతలంటూ ఎవరురారు. వ్యక్తులే వుంటారు. ఈ వ్యక్తుల integrity మీదనే అది ఆధారపడుతుంది. గతంలో హైదరాబాద్ రాష్ట్రములో అనుభవాలు వున్నాయి. ఇప్పటికీ మనం గ్రామాలలో చూస్తూనే వున్నాము. కోఆపరేటివ్ మూవ్‌మెంటుకు చెందిన కుటీరపరిశ్రమలకు ఎంతద్రవ్యం లభించవలెనో అది లభించటము లేదు. గ్రామాలలో మేము గ్రైన్‌బాంక్స్ పెట్టాము. అది ఒక కో-ఆపరేటివ్ మూవ్‌మెంటు. గ్రైన్ బాంక్స్ ఎవరిదగ్గర పెట్టామో అక్కడే గ్రైన్ అంతర్ధానమై పోయింది. ఈ విషయంలో మిత్రులు సుందరయ్యగారు నాతో ఏకీభవిస్తారు. ఖమ్మంలో 'టాకా' వుండేది. ఆ 'టాకా' ను కమ్యూనిస్టు మిత్రుడు నిర్వహిస్తూ వుండేవాడు. ఆయనపేరు జానకి రామయ్యగారు. 40,000 రు. టాకా డబ్బు దుర్వినియోగం అయినది. వేరే దుర్బుద్ధితో జరిగిందని, వారి పార్టీ ఆవిధంగా చెబుతుందని నేను భావించను. కోఆపరేటివ్ మూవ్‌మెంటుతో ఖమ్మం టాకా ద్రవ్యం తీసుకుపోయి ములుగుప్రాంతంలో దుర్వ్యయంచేసిన ఘట్టాలు

వున్నాయి. నా అనుభవాలేకావు. వారి అనుభవాలుకూడా నేను మనవి చేస్తున్నాను. మేమందరం కోఆపరేటివ్ మూవ్ మెంటుకు వ్యతిరేకులం కాము. మా అందరిధ్యేయమే అది. కోఆపరేటివ్ మూవ్ మెంట్ ను build-up చేయాలనే మా ధ్యేయం హెచ్చుగా పట్టణాలలోని వ్యక్తులు ముందుకు వస్తే ఈ కోఆపరేటివ్ మూవ్ మెంటు మీద మనం ఎదో స్వర్గాన్ని నిర్మాణం చేస్తామని అనుకొన్నాను. బహుశా అది మనకు పొసగదని నేను భావిస్తున్నాను. కోఆపరేటివ్ సిస్టమ్ద్వారా ఈ రూట్సు నడిపిస్తే మంచిది. లేకపోతే ప్రతి రూట్ మీద వచ్చే ఆదాయముపై టాక్సేషన్ ఎక్కువ చేసినట్లయితే చాలం బాగుంటుందని మనవి చేస్తున్నాను.

ఈ హైదరాబాదులో జాతీయంచేసిన రోడ్డు ట్రాన్స్పోర్టును పరిశీలిస్తే దానిలో జరిగే కరప్షన్ గురించి తెలుస్తుంది. మనం సుదీర్ఘమైన ఉపన్యాసాలు ఇస్తున్నాము. ఒక కండక్టర్ ఒక సంవత్సరం కాగానే మళ్ళీ ఉద్యోగం చేయడు. అటువంటివి వున్నాయి. లేవని చెప్పటానికి వీలులేదు. మంచి ధ్యేయంతో జాతీయం చేశాము. ఈనాడు మనకు మంచి వూహాలే వున్నాయి. మానవుల యొక్క భావాలలో పవిత్రతను సంపూర్ణంగా ఒక్కనాడే తీసుకు రాగల్గుతామని మనం భావించకూడదు. సమష్టిబాధ్యతగా taxation policy ని ఆలోచించి taxes ను సక్రమంగా ఎక్కువచేసి, పరిశ్రమలనుఅభివృద్ధి చేయాలని ప్రభుత్వం వారికి మనవిచేస్తూ యింతటితో సెలవు తీసుకొంటున్నాను.

[Sri G. Venkata Swamy — (Sirpur - Reserved)] (شری جی- وینکٹ سوامی (سرپور محفوظ) — مسٹر اسپیکر سر — انڈسٹریز کو ترقی دینے کی خاطر جو ڈیمانڈ آنریبل چیف منسٹر صاحب نے اس ھاوس مین پیش کیا ھے مین اُس کو ولکم (welcome) کرتا ھون - لیکن اسکے ساتھہ ھی ساتھہ آج تلک جو خامیان انڈسٹریز کے مینیجمنٹ (management) کے سلسلہ مین واقع ھوئی ھین یا جن کے آئندہ واقع ھونے کا امکان ھے اُن کے متعلق بھی مین تھوڑا بہت کہنا ضروری سمجھتا ھون - اگر ان خامیون کو دور نہین کیا گیا تو مجھے اندیشہ ھے کہ جسطرح سابقہ گورنمنٹ مین شری بی- رامکرشناراؤ کے زمانے مین انڈسٹریز بجائے ترقی کرنے کے دن بہ دن گرتی گئین اُسی طرح آندھرا کی انڈسٹریز بھی بجائے ھمین فائدہ پہنچانے کے نقصان پہنچائینگی - آنریبل چیف منسٹر صاحب نے فرمایا کہ ھمین انڈسٹریز کی ترقی کے سلسلہ مین بہت کچھہ کام کرنا ھے - مجھے ھی نہین بلکہ آندھرا پردیش کے پورے عوام کو چیف منسٹر شری سنجیوا ریڈی سے توقع ھے کہ اُن کے زمانے مین یہان کئی انڈسٹریز ترقی کرینگی - مین یہان سرپور اور سرسلک کے سلسلہ میں کچھہ کہنا ضروری سمجھتا ھون - وھان مزدورون کے ساتھہ جو جو ناانصافیان ھوتی ھین مین اُنسے واقف ھون - کیونکہ وھان مزدورون کی یونین مین مجھے کام کرنے کا موقع ملا ھے - مین وھان کی بہت ساری خامیون کو ھاوس کے سامنے رکھہ سکتا ھون - برلا برادرس نے سنہ ۱۹۵۳ع مین سرپور پیپر ملز کو حاصل

کیا۔اُس وقت وہ انڈسٹری اور اوس کی مشنری اچھے پیمانے پر چلنے کی حیثیت رکھتی تھی۔ اور اوس وقت برلا برادرس کو دینے کی کوئی ضرورت نہین تھی۔ نہین معلوم برلا برادرس کسطرح حیدرآباد مین اوس انڈسٹری کو حاصل کرنے مین کامیاب ہوگئے۔ اوس وقت اوس ملز سے ۱۴ سے ۱۸ ٹن کاغذ نکالا جاتا تھا۔ برلا برادرس نے اپنے ہاتھہ مین لینے کے بعد یہ دعوی کیا کہ اُس مین ۴۵ سے ۵۰ ٹن تک کاغذ نکالا جائیگا۔ حالانکہ واقعہ یہ ہے کہ اوس وقت حکومت کی جانب سے اس انڈسٹری کو چلانے کی اسکیم تیار کیگئی تھی۔ اور اوس کے تحت ایک نیا مشین بھی لایا گیا تھا۔ وہ مشین ۳۰ تا ۴۰ ٹن کاغذ تیار کرنیکی قوت رکھتی تھی۔ گویا اس مشین کے آنے کے بعد وہان ۴۵ تا ۵۰ ٹن کاغذ تیار ہوسکتا تھا۔ لیکن یہ دعوی کیا جارہا ہے کہ محض برلا برادرس کے آنے کی وجہہ سے وہان کی پیداوار مین اضافہ ہوا ہے، حالانکہ ایسا نہین ہے بلکہ نیا مشین لانے کی وجہہ سے پیداوار بڑھی ہے۔ اسکے علاوہ سمہ ۱۹۵۳ع مین جب یہ انڈسٹری برلا برادرس کے حوالے کیگئی تو اُس وقت اُسکی مشنری کی حالت اچھی تھی۔ لیکن آج اگر کسی اکسپرٹ کو وہان بھیجا جائے تو معلوم ہوگا کہ وہان کے پلانٹس کی حالت اتنی ردی ہو گئی ہے کہ سوائے اون کو (مینیجمنٹ کو) سزا دینے کے اور کوئی صورت نہین ہے۔ چیف انسپکٹر آف بوائلرس، شری مورتی نے انسپکشن کرنیکے بعد یہ رائے ظاہر کی کہ چند ہی سال کے اندر یہ ساری مشنری تباہ ہوجائیگی۔ برلا برادرس کا مقصد صرف اوس انڈسٹری سے زیادہ پراڈکشن حاصل کرنا اور پیسہ کمانا ہے۔ وہان کی مشنری کو اچھی حالت مین رکھنا اُن کا مقصد نہین ہے۔ ان حالات مین، مین حکومت سے خواہش کرتا ہوں کہ ایسی انڈسٹری کی حفاظت کرنیکی جانب حکومت زیادہ توجہہ دے۔ برلا برادرس آج اوس سے لاکھون روپیہ کمارہے ہین حکومت کو چاہئیے کہ اس جانب بھی توجہہ دے۔

اس کے بعد مین سرسلك فیکٹری کے متعلق تھوڑا سا عرض کرونگا۔ یہ فیکٹری سارے ایشیا مین اپنی نوعیت کی ایك ہے۔ لیکن وہان کے مزدوروں کی حالت بہت خراب ہے۔ آئے دن وہان ایکسیڈنٹس (accidents) ہوتے رہتے ہین۔ اور خطرناك اکسیڈنٹس ہوتے ہین۔ بعض وقت تو مزدوروں کا سر کٹ کر ایك طرف جاتا ہے اور ہاتھہ پاؤن ایك طرف جاتے ہین۔ وہان ایك پلانٹ جس سے گیاس پیدا کی جاتی ہے وہ اتنا خطرناك پلانٹ ہے کہ اگر خدانخواستہ عدم نگرانی کی وجہہ سے پھٹ جائے تو اوس کے دھماکے سے سارا کاغذ نگر برباد ہوجائیگا۔ کیونکہ اُس مین خاص قسم کے کیمیکلس (chemicals) وغیرہ تیار ہوتے ہین۔ اگر اوسکی دیکھہ بھال نہ کی جائے تو سارا کاغذ نگر برباد ہوجائیگا۔ برلا برادرس اسطرح اُس انڈسٹری کو چلا رہے ہین کہ ساری مشنری تباہ ہو رہی ہے۔ مین حکومت سے خواہش کرونگا کہ وہ انڈسٹری کو فوراً اپنے ہاتھہ مین لے لے۔ اس کے علاوہ وہ ایك پیئنگ انڈسٹری (paying industry) ہے۔ جس پر توجہہ دینے کی سخت

ضرورت ہے۔ اس میں شک نہین کہ ھمارا ملك اگریکلچرل ملك ہے لیکن حکومت ھند نے یہ اعلان کیا ہے کہ دوسرے پانچ سالہ منصوبہ میں انڈسٹریز کی طرف زیادہ توجہہ دیجائیگی۔ اس وقت برلا برادرس کی جانب (۳۱٫۲۹) لاکہہ روپیہ اون ھیں۔ جس وقت انھون نے اس انڈسٹری کو حاصل کیا تھا تو اوس وقت (loan) انھون نے وعدہ کیا تھا کہ جو بھی لون ہے وہ ایك یا دو سال مین واپس کردیا جائیگا۔ لیکن افسوس ہے کہ اب تك انھون نے صرف تھوڑا سا روپیہ حکومت کو واپس کیا ہے۔ اسلئے مین موجودہ چیف منسٹر صاحب سے خواھش کرونگا کہ اس وقت جو بھی رقم برلا برادرس کے ذمہ ہے آسکو شیر کیپٹل (share capital) مین تبدیل کرکے اس انڈسٹری کو نیشنلائز (nationalise) کیجئیے۔ ایك اور ھتیاچار بھی کاغذنگر مین مزدوروں کے ساتھہ کیا جارھا ہے جس کے متعلق مین حکومت کو آگاہ کرنا ضروری سمجھتا ھون۔ وھان ایك ایك وقت مین سات سات سو مزدوروں کو ٹرین مین بھر کر لایا جاتا ہے۔ اگر گستاخی نہ ھو تو یہ کہونگا کہ کاغذ نگر ساوتھہ آفریکا بنا ھوا ہے۔ جسطرح ساوتھہ افریکا مین نیگروز (Negroes) کے ساتھہ برتاو کیا جاتا ہے ویسا ھی برتاو کاغذ نگر مین مزدوروں کے ساتھہ کیا جاتا ہے۔ ایسی صورت مین ان انڈسٹریز کو ان لوگون کے ھاتھہ مین کیون دیا جا رھا ہے۔ اگر حکومت ان انڈسٹریز کو اپنے ھاتھہ مین لیکر چلائے تو حکومت کو لاکہون روپیہ کا فائدہ ھوسکتا ہے۔ اسکے علاوہ وھان کے ٹیکنیکل لوگون سے یعنی انجینیرس وغیرہ سے اگریمنٹ (agreement) لیا جاتا ہے کہ وہ نوکری سے نہین نکلینگے۔ جو لوگ ایسا اگریمنٹ کرنے پر تیار نہین ھین اون سے رزگنیشن (resignation) دینے کے لئے کہا جاتا ہے۔ کئی لوگون کو اس طرح نکالا گیا ہے۔ وھان ایك ایك مارواڑی ایك ایك سال مین چھہ سو روپیہ کی ترقی کرتا ہے لیکن ایك ورکر کو سالانہ دس روپیہ بھی زیادہ نہین دئیے جاتے۔ اگر ایسے لوگون کے ھاتھہ مین انڈسٹریز رھین تو ھمارے ملك کو کسطرح فائدہ پہونچ سکتا ہے۔ انڈسٹریل کورٹ مین کیس چلانے کے لئے ایك مہنہ مین ایك لاکہہ روپیہ خرچ کرتے ھین لیکن بونس کے لئے خرچ کرنا نہین چاھتے۔ یہی حال آلوین اور اسبسٹاس کا ہے۔ آلوین مین حکومت کے (۵۴) فیصد شیرس ھین مین چیف منسٹر صاحب سے درخواست کرونگا کہ حکومت ان انڈسٹریز کو اپنے ھاتھہ مین لیکر چلائے۔ اسبسٹاس مین حکومت کے (۶۴) فیصد شیرس ھین۔ شوگر فیکٹری بھی تقریباً حکومت کی ھی ہے۔ اس کو بھی حکومت اپنے ھاتھہ مین لے لے۔ تب ھی ھم سکنڈ فائیو ایر پلان مین انڈسٹریز کو آگے بڑھا سکتے ھین۔ ایك اور بات کہنا مین ضروری سمجھتا ھون۔ گورنمنٹ آف انڈیا نے فیصلہ کیا ہے کہ ورکرس کے رپرزنٹیٹیوز (representatives) کو ڈائرکٹرس بنایا جائے۔ چیف منسٹر صاحب سے ورکرس یہ آشا رکھتے ھین کہ وہ اس سلسلہ مین ایك قدم آگے بڑھائینگے۔ اگر اس طرح کا قدم اٹھایا جائیگا تو ورکرس بھی چکنگ (checking) رکھہ سکینگے کہ کہان کہان مسمینیجمنٹ (mismanagement) ھورھا ہے، کہان کہان لاکھوں روپیہ غبن ھو رھا ہے، کہان کہان مینیجمنٹ اپنے

فائدہ کے لئے حکومت کا نقصان کر رہا ہے۔ مین حکومت سے خواہش کرونگا کہ میرے اس سجیشن پر غور کیا جائے۔ تاج گلاس فیکٹری کا مسئلہ بھی ایک بہت بڑا مسئلہ بنا ہوا ہے۔ وہان ایک زمانہ سے لاکھون روپیہ کہایا جارہا ہے۔ حکومت کی جانب سے اوسکو لاکھون روپیہ لون دیا گیا۔ زمانہ بدل چکا ہے لیکن اُن لوگون کی پرانی عادت بدلی نہین۔ کم از کم اس دور میں تو اوس عادت کو بدل جانا چاہئے آخر میں، میں حکومت سے خواہش کرونگا کہ میں نے جو سجیشنس دئے ہین اون کو قبول فرمائیے۔ آخر مین اسپیکر صاحب کا شکریہ ادا کرتا ہون کہ انہون نے مجھے بات کرنے کا موقع دیا ہے۔

*Smt. Kusum Gajapathi Raju (Gajapathinagaram-General): With your permission, I would like to go a little bit into the time before the formation of the Andhra Pradesh. The Telugu-speaking areas were divided into two parts in the country-what was formerly Andhra and what was formerly Telangana. They came together for the cultural resurgence of Telugu culture; but there can be no such cultural resurgence without a sufficiently good economic rehabilitation of the working classes - instead of the present show we have and pomp right at the top, paid for by the starving tax-payers.

The former Andhra State was predominantly agricultural. We had no industries, Sir, worth speaking of, and, consequently, we had no cities. Hyderabad supplied the great necessity of the former Andhra Province. Our Ministers came here and they found that Hyderabad was a very nice place to fatten themselves and their dependents and friends on the industrial potential here. Now, unlike the former Andhra Province, the former Telangana was industrialised. True, the Nizam who would not be considered an industrial magnate-many of us regarded him as a man with a sort of 18th century ideas brought into the 20th century—but, even so, he did have some kind of industries, possibly to keep himself going on and to help certain vested interests around him like Mr. Laik Ali and the gentleman who built the Gandhi Bhawan for the benefit of the Congress Party today.

*The Ministor for Planning & Development ( Sri V. B. Raju ):* Historically, a very incorrect fact.

*Smt. Kusum Gajapathi Raju:* I do not think so.

The only industrial concern which is run by the Government making some kind of profit today is the Nizam Sugar Mills; but I shall come to that later. The face value of the shares in Government industries may be in hundreds but their market value is just about Re. 0-4-0 or Re. 0-5-0. Obviously, the market value for ministry also is no higher than Re. 0-4-0 or Re. 0-5-0. So far as the Nizam Sugar Factory, I would compare it with the Vuyyur factory. The Nizam Sugar Factory has a crushing capacity which is about

twice as much as that of the Vuyyur factory, but yet the profits shown are 42 lakhs as against 32 lakhs of the Vuyyur factory. The Congress Government is of course the heir to the Nizam and, like their predecessors, they also believe in having their own vested interests,—not necessarily local,— around them, to keep them going on. They seem to have developed fancy for Marwari capitalists in this country. The special favourite, I think, is the Birla group. They have enlisted the help of the Birla group in managing a number of their industries here. Now, I would like to know whether the help of the Birlas was enlisted because the Government finds itself incompetent to run the industries, and what exactly are the terms of agreement between the Government, the nominal managing agents, and the Birla Group. I would like the details to be laid on the Table of the House immediately. I was listening to what the Chief Minister had said about his wanting co-operation etc. Since he seems to be so much interested in the industrialization of this State, I would be very glad indeed if he places this agreement on the Table of the House immediately. There is also the Taj Glass Factory. It seems to be rather a famous thing in this place. They had a loan from the State Finance Corporation of about 20 lakhs. The loan has not been repaid. They have made it clear that they have no intention of repaying the loan ; and, on the other hand, they have made a demand of another 20 lakhs. Now what exactly is the inducement they have offered to the Government to put in the extra 20 lakhs and what are the terms of the agreement there? Allwyns which seems to be another firm in which the Government is taking interest have a short decline in their share value. They are 40 percent of their original value. Why? With such great interest being evinced in industrialization, I do not see why the share values of the supposedly Government-managed firms go down so steeply. The Singareni Collieries are supposed to have a very fine quality of coal and they are supposed to be almost in a monopolistic position in the south and in a position to supply coal all over; and, yet why is it that their profits are so low. Government said the overhead charges are high. Is it possible to get another type of management other than Mr. Jagtiani who might be able to pull down the overhead costs? All these questions are rather serious when it comes to the modern State and the Ministers want to help in the industrialization. But I do not see they are doing anything about it. They seem to encourage and bolster Birlas and lesser Birlas and seem to be unable to manage without them altogether.

I would therefore demand the appointment of a Committee in this House to enquire into all these state-managed industries, and I would also demand that the reports of Kasturibai Lalbhai Committee, the Wadia Committee and the Daghe Enquiry Committee be laid on the Table of the House.

Thank you, Sir.

*శ్రీ టి. లక్ష్మీనారాయణరెడ్డి (అనపర్తి) : అధ్యక్షా, ఆంధ్ర రాష్ట్రం వ్యవసాయకంగా ఆహార పదార్థాలకు సంబంధించినంతవరకు surplus State గా భావించ బడుతున్నది. పాడి పంటలు, మొదలగు సహజ సంపదలు కూడా ఉన్నాయి. అయినప్పటికి మన రాష్ట్రంయొక్క సరాసరి ఆదాయం భారత దేశం మొత్తం సరాసరి ఆదాయం కంటె చాల తక్కువగా ఉన్నది. మన per capita income 236 రూపాయలు మాత్రమే. భారతదేశంలో సరాసరి ఆదాయం 281 రూపాయలు ఉన్నవి. ఆంధ్ర రాష్ట్రం సహజ సంపదలు గలిగిన రాష్ట్రం. ఆహార పదార్థాల కొరతలేని రాష్ట్రం అయినప్పటికి ఎందుచేత తలసరి ఆదాయం ఇంత తక్కువ అవుతున్నది అని చూచినట్లయితే "పారిశ్రామికంగా దేశం అభివృద్ధి కాకపోయినట్లయితే వ్యవసాయకంగా ఎంత ముందుకు పోయినప్పటికీ తలసరి ఆదాయం పెరగదు" అని తక్షణమే అర్థమవుతుంది. జనాభా చూచినట్లయితే 3 కోట్లకు మించి ఉన్నది. అందులో కోటి మంది మాత్రమే పని చేస్తున్నారు. అంటే economic గా active గా ఉన్న వాళ్లు ఒక కోటి మంది అయితే పనిలేకుండా ఉన్న వాళ్లు 2 కోట్ల మంది. పనిచేసే ప్రతి ఒక్క మనిషిమీద ఇద్దరు మనుష్యులు ఆధార పడుతున్నారన్నమాట. ఇటువంటి పరిస్థితులలో ఎప్పటికి మనం full employment సంపాదించుకో గలుగుతాము ? తలసరి ఆదాయం ఎలా పెంచగలుగుతామని ఆలోచించినట్లయితే వ్యవసాయకంగానే కాకుండా పారిశ్రామికంగా కూడా మనం అభివృద్ధి చెందవలసి ఉంటుంది.

మొదటి పంచవర్ష ప్రణాళికలో భారీ పరిశ్రమల కొరకు చేసినది ఏమీ లేదు. Andhra Paper Mills, Ceramic Factory వంటి ఒకటి, రెండు, భారీ పరిశ్రమలు మాత్రం కనపడుతున్నాయి. అవి కూడా ఈ మధ్య వరకు ఏమీ లాభదాయకంగా లేవు. ఇప్పుడిప్పుడే లాభాలు సంపాదించడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి. భారీ పరిశ్రమలు, లఘు పరిశ్రమలు అభివృద్ధి చెందితేనేగాని మన ఆదాయం పెరగదు. అందరికి పని కల్పించలేము అని తెలుస్తూనే ఉన్నది. రెండవ పంచవర్ష ప్రణాళికలో అనేక ఫ్యాక్టరీలు పెట్టాలని సంకల్పించాము. Sugar Factory ల గురించి అనేక మందికి licences ఇవ్వబడినాయి. సిమెంటు ఫ్యాక్టరీలగురించి కూడా కొంతమందికి licences ఇవ్వబడ్డాయి. Sugar Factorys లో share ధనాన్ని పోగుచేయడానికి చాలమంది ఎంతో ఉత్సాహంగా ముందుకు వచ్చినప్పటికి అవి పోగు పడడంలేదు. కారణం ఏమిటో తెలియడంలేదు. ఈ విషయంలో ప్రభుత్వం మరికొంత శ్రద్ధ వహించి share ధనాన్ని తగ్గించో, మరొక విధంగానో సహాయపడక పోయినట్లయితే ఆ ఫ్యాక్టరీలైనా రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో వస్తాయన్నే ఆశ లేకుండా పోతుంది.

రెండో పెద్ద వృత్తి చేనేత Weavers ఉన్నారు Handlooms ఉన్నాయి. ఈ handlooms పరిస్థితి కూడా అంత ప్రోత్సాహకరంగా లేదు. Subsidy లు ఇస్తూనే ఉన్నాము. కాని అవి చాలీచాలకుండా ఉన్నాయి. వారి కుటుంబాలు గడవడమే లేదు. ఇంకా ఎక్కువ చేయవలసిన అవసరం కూడా కనపడుతున్నది. ఇట్లా ఎప్పుడూ సబ్సిడీలు ఇచ్చుకుంటూ పోవలసిందేనా ? దీనికి ఏమి మార్గం లేదా ? నాకు ఒకటి తోస్తోంది. Power looms ను introduce చేయండి. ప్రస్తుతానికి weavers అంతా oppose చేస్తారు. దానికి సందేహంలేదు. కాని కొంతకాలం పోయేటప్పటికి power looms వల్ల వాళ్ల ఆదాయం పెరుగుతుంది. వాళ్ళ వృత్తికూడా పెరుగుతుంది. ఎక్కువ బట్ట export అయినప్పటికి కూడా ధర పడిపోదు. వాళ్ళకు ఎక్కువ ఆదాయం వస్తుంది. పని జరుగుతుంది. కాబట్టి ప్రభుత్వం దీనిని గురించి brave steps తీసుకోవలసి ఉంటుందని, తాత్కాలికంగా వచ్చే అడ్డంకులను లెక్క చేయకూడదని నేను ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

ఆంధ్ర పేపర్ మిల్లులో ఇప్పుడు strike జరుగుతున్నది. అందువల్ల production ఆగిపోతున్నది. మనకు ఒక పేపరుమిల్లు ఉన్నది. దానికి లాభాలు తక్కువగా వస్తున్నాయి. మానేజిమెంటులో శక్తి లేకపోవడం, tactical గా deal చేయలేకపోవడం, ఈ strike కు కారణమనుకొంటున్నాను. అక్కడి కార్మికులకు 6 రూ. లు ఎక్కువ యిస్తామనే ఆశ కల్పించారు. వారికి నచ్చచెప్పే వారెవరు లేకపోవడంవలన ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం యిస్తానన్న 6 రు.లు బుద్ధిపూర్వకంగానే యివ్వడం లేదనే ఆలోచన వారిలో కలిగింది. కేంద్ర ప్రభుత్వం ఆమోదిస్తుందా, లేదా అనే విషయం ఆలోచించకుండా ముందుగా హామీ యిచ్చినందువల్ల ఆ కార్మికులు దానినే పట్టుకుని "6 రూ. లు యిస్తామని చెప్పి ప్రభుత్వం మళ్ళా వెనక్కు పోయింది" అని గోల చేస్తున్నారు. కాబట్టి ప్రభుత్వంవారు ఈ విషయాలన్నింటినీ ఆలోచించి వారిని సానుభూతితో చూచి, strike ను అంత ముందించక పోయినట్లయితే production దెబ్బతింటుంది, నష్టం వస్తుంది.

ఇక్కడ Road Transport జాతీయం చేయబడింది. చాలా నష్టం వస్తున్న సంగతి కూడా ముఖ్యమంత్రిగారు చెప్పారు. నేను ఈ విషయమై కొంచెం పరిశీలించినాను. నాకు తెలిసినంతవరకూ high salaries ఒక కారణంగా కనబడుతోంది. Inefficient management కూడా ఒక కారణంగా కనబడుతున్నది. హైదరాబాదు స్టేటు మూడుభాగాలుగా విడిపోయినప్పుడు 60, 40 నిష్పత్తిలో అక్కడ వున్న కార్మికులను, technical personnel నూ పంచినప్పుడు మనకు ఎక్కువమంది వస్తున్నారు. 40 కంటె ఎక్కువ పోలేదు. అందుచేత ఇది ఒక ముఖ్యకారణంగా కనబడుతోంది. Discriminate గా

మనకు spare parts అవసరముంటాయో, లేదో తెలియకుండా కోటిరూపాయల విలువచేసే spare parts పాతబడిపోయినాయనే సంగతి అందరకూ తెలిసినదే, దీనిని గురించి సమగ్రమైన పరిశీలన చేయకపోతే నష్టం అట్లా వస్తూనేవుంటుంది. ఇకముందుకూడా ప్రభుత్వం nationalise చేసే సంస్థమీద నమ్మకం పోతుంది. నేషనలైజ్ సిద్ధాంతాన్నే వ్యతిరేకించడానికి మొదలు పెడతారు. కాబట్టి దీనిని అతిత్వరలో పరిష్కారం చేయవలసి వుంటుంది. ఇంకా ఇతర జిల్లాలలోకూడా మోటార్ రవాణాను nationalise చేయాలా, వద్దా అనే సమస్యలున్నాయి. ఏమైనప్పటికీ nationalised industries లో మనుషులు ఎక్కువగా ఉన్నారు కాబట్టి వారిని అవతలకు పంపలేము కాబట్టి ఇంకా 1, 2 జిల్లాలను nationalise చేసి ఈ workers ను, technical personnel ను అక్కడకు పంపించినట్లయితే మనకు నష్టం లేకుండా, లాభదాయకంగా వుంటుందనుకొంటున్నాను.

*శ్రీమతి వై. సీతాకుమారి (భాన్సువాడ): ఈడిమాండులను నేనుబలపరుస్తూ ఒకటి, రెండు సూచనలు చేస్తున్నాను. ఆసియాకంతకూ పెద్దపెద్ద పరిశ్రమలని పేర్కొనబడిన భారీపరిశ్రమలు తెలంగాణాలో ఉన్నాయి. అవి భారతదేశానికంతకూ చాలా గొప్పవిగా భావించబడుతున్నాయి. ఇప్పుడు అదృష్టవశాత్తూ మన ఆంధ్రులమంతా ఒకటిగా అయినాము. మన అందరికీ సరిపోయే పరిశ్రమలు మనకు ఉన్నాయి. వాటిని మనం బాగా పెంపొందేటట్లు చేసికొని, వాటిలో ఏమైనా లోపాలున్నట్లయితే వాటిని తొలగించుకొని అభివృద్ధి చేసుకోవలసి యున్నది. ఇప్పుడు అనేకమంది సభ్యులు చేసిన సూచనలప్రకారం కొద్ది రోజులలో మనదేశంలో వుండే పారిశ్రామికలోటు అంతాపోయి, మనం అందరికీ ఆదర్శవంతమైన జాతిగా పరిగణింపబడగలము. అందుకై మనం సర్వశక్తులనూ ఉపయోగించి, పరిశ్రమలనన్నింటినీ బాగా అభివృద్ధి చేసుకోవాలి. ఇంకా factories ను నెలకొల్పడానికి ప్రయత్నం చేయవలసి వుంటుంది. నిజామాబాద్ పంచదారమిల్లును గురించి చాలామంది సభ్యులు వారికి తెలిసిన విషయాలను, అందులోని లోపాలను చెప్పారు. దానినిగూర్చి నాకు తెలిసినలోపాలు కొన్ని చెబుతాను.

అక్కడ కొందరు పెద్దపెద్ద భూస్వాములు ఎక్కువ కోటాలను తీసికొని తమకులేని కోటాలను కూడా బీదరైతుల దగ్గరనుంచి తీసికొని వేరే ఎక్కువ ధరలకు అమ్ముతారట. ఇందువల్ల బీదరైతాంగానికి చాలా నష్టం కల్గుతున్నది. ఈ విషయాన్ని ముఖ్యమంత్రిగారు note చేసికొని ప్రభుత్వం అక్కడ ఎవరిని నియమించినదో వారిని విచారించడానికి ప్రయత్నించవలసివుంటుంది. అక్కడ చాలా లోపాలు జరుగుతున్నాయని చెబుతున్నారు. ప్రతిచిన్న విషయాన్ని కూడా సవ్యంగా విచారించి ఈ చక్కెర ఫ్యాక్టరీని సౌభాగ్యవంతమైనదిగా రూపొందించవలసి ఉంటుంది.

ఇదివరకు నిజామాబాదు రైతులు వారి దగ్గరకు రాయబారాలు వెళ్ళి నారు. కొన్ని విషయాలు చెప్పారు. ఇప్పుడు మళ్ళా వెళ్ళడానికి సిద్ధంగా వున్నారు. Co-operative basis మీద నిజామాబాద్‌లో ఇంకొక చక్కెర మిల్లును నెలకొల్పాలని అనుకొంటున్నారు. అక్కడ వారికి తగినంత నీరు ఉన్నది. కావలసిన చెరుకుపంట అధికంగా ఉన్నది. రైతులదగ్గర చాలా ధనం ఉన్నది. కావలసినంత సొమ్ము shares వసూలు చేస్తామంటున్నారు. అదికూడఒక ముఖ్యమైన అవకాశంగా తీసికొని త్వరలోనే అక్కడ రెండవ చక్కెర ఫ్యాక్టరీని నెలకొల్పడానికి ప్రభుత్వం అనుమతించవలసినదని ముఖ్యమంత్రిగారికి విన్నవిస్తూ ఈ డిమాండును బలపరుస్తూ నేను విరమిస్తున్నాను.

* శ్రీ పి. సత్యనారాయణ (సామర్లకోట): అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు Table మీద పెట్టిన కాగితాలను చూచాము. వారు మొట్టమొదట చేసిన ఉపన్యాసం కూడా విన్నాము. కాని పరిశ్రమలవిధానంలో మన రాష్ట్రానికి ఒక నిర్దుష్టమైన పాలసీ లేదని తోస్తున్నది. భారతదేశానికంతకూ కూడ ఒక నిర్దుష్టమైన పాలసీ లేదని నా ఉద్దేశ్యం. రెండవ పంచవర్ష ప్రణాళికలో ఒక రాష్ట్రానికీ, మరొక రాష్ట్రానికీ చాలా తేడాలున్నాయి. మన రాష్ట్రంలో మొత్తం investment చూచినట్లయితే 2% కంటె ఎక్కువలేదు. మిగిలిన అన్ని రాష్ట్రాలలోనూ అట్లాలేదు. organised labour చూచినట్లయితే 6% కంటె ఎక్కువలేదు. మిగతా రాష్ట్రాలలో ఇంకొక విధంగా ఉన్నది. Cottage industries 42% ఉన్నవి. ఈ స్వభావ గుణాలనుబట్టి మన రాష్ట్రానికి ఒక industrial policy ఏర్పరచుకోవడం చాలా అవసరమని తోస్తున్నది. అది ఏర్పరచు కొన్నప్పటికీ మన రాష్ట్రంలో వుండే ఖనిజ సంపదను ఉపయోగించనిదే లాభం లేదు. Management - labour relations ను బట్టికూడా వ్యాపారసంస్థలలో, పారిశ్రామిక సంస్థలలో ఉత్పత్తి పెంపొందుతూ ఉంటుంది. ఈ విషయాలన్ని దృష్టిలో పెట్టుకొని ఒక పాలసీని ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఇది ఎంత త్వరలో ఏర్పాటుచేస్తే అంత ఎక్కువ వెలుతురు వస్తుంది. అందుచేత ఈ విషయంలో ఆలస్యముచేయకుండా ఒక నిర్దుష్టమైన పాలసీ స్టేట్‌మెంట్‌ను తయారుచేయాలని కోరుతున్నాను. ఈ పరిశ్రమలను గురించి కొన్ని పునాది విషయాలు తెల్సుకొన డానికి నేను 4 రోజులనుంచి ప్రయత్నిస్తున్నాను. మనకున్నటువంటి సాహిత్యం లైబ్రరీలలోనూ, Economic Bureau, Statistical Bureau యిలాంటి వాటిల్లో ఉన్నాయి. కాని అందులో చాలా ముఖ్యమైన పుస్తకములు దొరుకుటలేదు. ముఖ్యంగా మనరాష్ట్రంలో ఉన్నటువంటి industrial rated capacity ఎంత? ఏఏ పరిశ్రమలలో ఎంతెంత ఉత్పత్తి శక్తిమత ఉన్నది? ఇందులో ఎంతమూలపడి ఉన్నది, ఎంతవరకు ఉపయోగంలో ఉన్నది అనే విషయాలు తెలుసుకొనడానికి books అందుబాటులో లేవు. స్వరాజ్యం వచ్చినతరువాత 1947 వ సం॥నుంచీ

